# బ్రెయిన్ రీడింగ్‌తో ఆట
# (సైంటిఫిక్ రీసెర్చ్ నవల)

## ఒకరికి తెలిస్తే రహస్యం, పదిమందికి తెలిస్తే నిజం

mohan
PUBLICATIONS




రేడియో వేవ్స్

టచ్ ఏరియా

మూమెంట్ ఏరియా

ఆలోచనా కేంద్రం

దృష్టి కేంద్రం

శ్రవణ కేంద్రం

వాక్ కేంద్రం

రచయిత
పిళ్ళా లక్ష్మీనారాయణ

contact to:7995196139,/ 7287839939

# ముందు మాట

నేను ఈ నవలను సుమారు 2 సం॥లు క్రితం రాయడం ప్రారంభించాను, నేను కొంత కథ రాయడం ప్రారంభించాక ఆ పుస్తకం కన్పించకుండా పోయింది. మిగతా కథ కంటిన్యూ చేయడం కోసం మరో పుస్తకంలో 2-3 పేజీలు రాయడం మొదలు పెట్టాక ఆ పుస్తకం కూడా కనబడకుండా మాయం అయ్యింది. ఇది చదువుతుంటే విచిత్రంగా ఉంది కదూ, నేను రాస్తున్న ఈ సైంటిఫిక్ డిటెక్టివ్ నవలలో ఎన్నో నమ్మలేని వింతలు, విచిత్రాలు, సామాన్య మానవులకు అర్ధంకాని వైద్యశాస్త్ర పరిశోధనా అంశాలు, యదార్ధ వాస్తవ సంఘటనలు చదువుతుంటే ఒకొసారి కట్టుకథలా అనిపిస్తాయి

ఇక ఈ కథ యొక్క ముఖ్య ఉద్దేశ్యం ఆల్ఫ్రెడ్ నోబుల్ డైనమైట్‌ను కనుగొన్నాడు. అప్పటి జనాలకు తెలియని ఒక కొత్త ఆవిష్కరణ అది, ఆ తర్వాత నోబెల్ ఎందుకు డైనమైట్‌ను కనుగొన్నానా, అది ఎందరి వినాశనానికి కారణం అయ్యిందా అని బాదపడ్డాడు.

ఆటంబాంబును తయారుచేసి దానిని రెండో ప్రపంచయుద్ధంలో జపాన్‌లోని హిరోషిమా, నాగసాకీలపై ప్రయోగించి, లక్షలాది ప్రజల ప్రాణాలు కోల్పోయేలా చేసిన తర్వాత ఆటంబాంబును తయారు చేసిన శాస్త్రవేత్తలు మానవాళికి తమ రీసెర్చ్ ద్వారా ఎంత నష్టం కల్గించారో తెల్సిందే.

నేను ఈ కథను నీతులు, సూక్తులు చెప్పటం గూర్చి రాయటం లేదు. మనస్సున్న మంచి మనుషులు, లోకక్షేమం కోరే మేధావులు ఒక్క క్షణం ఈ నవల చదివి ఆలోచిస్తారు అని ఆశిస్తూ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం మానవునికి వరమా లేక శాపమా అని తెల్పేందుకు ఈ కథ రాస్తున్నాను.

ఈ కథలోని అంశాలు తెలియజేసే ముందు ఈ నవలకు బ్రెయిన్ రీడింగ్‌తో ఆట సైంటిఫిక్ రీసర్చ్ నవల అని పేరు పెట్టడం గూర్చి కొంత అయినా చెప్పటం భావ్యంగా ఉ ంటుంది.

దుర్మార్గుల చేతిలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఉంటే భావితరాలకు ఎలాంటి నష్టం కల్గుతుందో చెప్పడానికి కొన్ని వాస్తవ సంఘటనలను తెలియజేయటం, ఈ కథ ముఖ్య ఉద్దేశ్యం. ఇది పూర్తిగా సైంటిఫిక్ రీసెర్చ్ ఓరియంటెడ్ కథ. కొందరు డాక్టర్లు, సాఫ్ట్‌వేర్ ప్రోఫెషనల్స్ కల్సి చేసిన రహస్య రీసెర్చ్‌ని వివేక్ అనే యువకుడు ప్రజలకు ఎలా తెలియజేసాడు, ఆ భయంకర వైట్‌కాలర్ నేరాన్ని రీసెర్చ్‌ను సమాజానికి తెలియచేసి ప్రజలను ఎలా కాపాడాడు అనేది ఈ కథ.

ఇది చదవండి, ఒక్క క్షణం నిజానిజాలు తెల్సుకోటానికి ప్రయత్నించండి. పదిమందితో ఈ కథను చదివించండి ఇది ఒక సినిమా స్టోరి లాంటిది కాదు, నాటకం అంతకంటే కాదు, సమాజంలో డాక్టర్లు, పెద్దమనుషులుగా చెప్పుకొనే వైట్‌కాలర్ నేరస్తులు చేసే తప్పుడు పనులను తెలియజేయటమే నా యీ కథ మరో ముఖ్యఉద్ధేశ్యం.

ఏంటి ముందుమాట పేరుతో ఈ నవలారచయిత అయిన పిళ్ళా లక్ష్మీనారాయణని ఇంత పెద్ద ఉపోద్ఘాతం ఎందుకు రాసాను అనుకుంటున్నారా, ఎందుకంటే ఇందులోని అనేక అంశాలు సామాన్య ప్రజలకు ఒక పట్టాన్న అర్ధం కావు. ఇక్కడ సామాన్య ప్రజలు అనే పదానికి అర్ధం మధ్యతరగతి ప్రజలనో, లేక సామాన్య చదువు సంధ్యలు కల్గిన వారనో భ్రమించకండే, ఆర్థిక శాస్త్రంలో అనగా ఎకనమిక్స్‌లో ఎం.ఎ చేసి పి.హెచ్.డి. చేసిన వ్యక్తికి కూడా ఈ కథలోని అంశాలను ఒకసారి చదివితే అవి ఒక పట్టాన్న అర్థం కావు. కారణం నేను రాసిన, తెలియజేస్తున్న అంశాలు సైంటిఫిక్ దృక్పధం అనగా సైన్సు సబ్జక్టులోని అనేక బ్రాంచ్‌లు గూర్చి కొంత అవగాహన కల్గిన వారికి మాత్రమే ఇది అర్ధం అవుతుంది. ఇది ఒక లాయర్, సాధారణ వ్యాపారవేత్త చదివితే ఇందులోని పస బదులు నస కనబడుతుంది. ఎందుకంటే మనకు తెలియని క్రొత్త విషయం ఎపుడూ నమ్మబుద్ధికాదు, అదే కామన్ హ్యూమన్ సైకాలజీ.

నేను ఈ కథా పరిచయం పేరుతో చదివే మిమ్మల్ని విసిగించలేదు కదా, నా మీద మీకు కోపం కల్గి ఈ బ్రెయిన్ రీడింగ్‌తో ఆట సైంటిఫిక్ రీసర్చ్ నవలని చిరాకుగా ప్రక్కకు పడవేయకుండా, ఇక కథలోకి వద్దాం.

ఇట్లు మీ

**పిళ్ళా లక్ష్మీనారాయణ,**

బి.ఎస్.సి. బి.యిడి. ఎం.ఎ తెలుగు లిట్ (ఎం.ఎస్.సి. బయోటెక్)

contact.no.7995196139,
7287839939

వివేక్ ఒక సామన్య మధ్యతరగతి యువకుడు, ఇతనికి అమ్మా, నాన్న, వెంగళప్ప, వెంకమ్మలు, ఒక తమ్ముడు రఘు. ఇది వివేక్ కుటుంబం. ఉన్నంతో సర్దుకుపోతూ చీకు చింత లేకుండా వాళ్ళ సంసారం సాగిపోతుంది. వివేక్ తన డిగ్రి అయ్యేక ఉద్యోగాల వేటలో పాపం అందరిలాగానే కాళ్ళ చెప్పులు అరిగేలా తిరుగుతుంటాడు. వివేక్ తండ్రిది ఒక బుక్ షాప్ ఖాళీ సమయంలో వివేక్ వాళ్ళ నాన్న గారి షాపుకి వెళ్ళి సాయం చేస్తుంటాడు. వివేక్‌కి ఒక స్నేహితుడు ఉంటాడు అతని పేరు ఆనంద్. వివేక్ ఆనంద్‌లు కలిసి తమ ఉద్యోగ ప్రయత్నాలు చేస్తూ ఉంటారు. ఆనంద్‌కి ఒక చెల్లి ఉంటుంది పేరు నవీన.

ఒక రోజు వివేక్ ఇంటర్వ్యూకి అని అలహాబాదు వెళ్తాడు, అక్కడ వివేక్‌కి అనుకోని సంఘటనలు ఎదురౌతాయి. ఆ సంఘటనలు ఏంటో మీరే ఆ పాత్రలు ద్వారా తెలుసుకోండి.

**వివేక్ :** ఇంటర్వ్యూకి వెళ్ళిన ఆఫీసులో రిసెప్షనిస్ట్‌తో

**వివేక్ :** ఎక్స్యూజ్‌మీ, నాపేరు వివేక్, ఆంధ్రా నుంచి ఇంటర్వ్యూ కోసం వచ్చాను.

**రిసెప్షనిస్ట్:** ఓ.కె. మీరు వెయిటింగ్ రూములో వెయిట్ చేయండి, మీ టైమ్ రాగానే మిమ్మల్ని ఇంటర్వ్యూకి పిలుస్తాను.

**వివేక్ :** ఓ.కె. నేను వెయిట్ చేస్తాను.

**రిసెప్షనిస్ట్ :** మిస్టర్ వివేక్ టైమ్ ఎంతయ్యింది ?

**వివేక్ :** 11.00 గం॥

**రిసెప్షనిస్ట్ :** మీ టైమ్ తప్పు, వాల్ క్లాక్ చూడండి, 11:30.

**వివేక్ :** ఇట్స్ ఆల్ రైట్,

వివేక్ వెయిటింగ్ హాల్‌లో వెయిట్ చేస్తుంటాడు.

కొంత సేపటి తరువాత వివేక్‌ని ఇంటర్వ్యూకి పిలుస్తారు.

కంపెనీ చైర్మన్ తన కేబిన్‌లో కూర్చుని ఉంటాడు.

**వివేక్ :** నేను లోపలికి రావచ్చా సార్.

**చైర్మన్ :** ఎస్, లోపలికి రండి,

వివేక్ లోపలికి వెళ్ళతాడు

**చైర్మన్ :** ప్లీజ్ టేక్ యువర్ సీట్.

వివేక్ కూర్చుంటాడు.

చైర్మన్ మీ పేరు ?

**వివేక్ :** నాపేరు వివేక్

**చైర్మన్ :** ఎక్కడి నుండి వచ్చారు ?

**వివేక్ :** వైజాగ్ నుండి.

**చైర్మన్ :** నేను మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను.

**వివేక్ :** అడగండి సార్

**ఛైర్మన్ :** వివేక్ ఈ టీ తీసుకోండి.
**వివేక్ :** థాంక్యూ సార్.
**ఛైర్మన్ :** వివేక్ నేను నిన్ను టీ త్రాగమనలేదు. తీసుకోమన్నాను. నేను అడిగే ప్రశ్నకు సమాధానం చెబితే నువ్వు ఆ టీ త్రాగవచ్చు.
**వివేక్ :** అడగండి సార్
**ఛైర్మన్ :** నువ్వు ఆ టీ రుచి చూడకుండా అందులో పంచదార కలిపింది లేనిది చెప్పగలవా ?
వివేక్ ఒక 30 సెకన్లు తరువాత ఇలా చెబుతాడు. టీ లో పంచదార కలపబడింది.
**ఛైర్మన్ :** ఎలా చెబుతున్నావు ?
**వివేక్ :** మీరు ఇందాక టీ కప్పు నా చేతికి ఇస్తున్నపుడు ఒక డ్రాప్ టీ టేబుల్ మీద పడింది. పంచదార కలిసిన టీ డ్రాప్ పలుచగా ఉంటుంది.
**ఛైర్మన్ :** గుడ్ వివేక్, నీకు నేను నేపాల్‌లో ఉద్యోగం ఇస్తే చేయడానికి వెళతావా ?
**వివేక్ :** అది మీరు ఇచ్చే శాలరీని బట్టి ఉంటుంది సార్.
**ఛైర్మన :** ఓ.కె. వివేక్, నువ్వు సెలక్ట్ అయ్యావు.
వివేక్ మరో రెండు రోజులు అక్కడ ట్రెనింగ్ పేరుతో ఉండి, తిరిగి తన స్వస్థలం వైజాగ్ చేరుకుంటాడు. వివేక్ వైజాగ్ చేరిన తర్వాత, వైజాగ్ దగ్గరలోని అనకాపల్లిలో ఆ కంపెనీ తరుపున సేల్స్ రిప్రజంట్ గా చేరుతాడు. వివేక్ తన కొత్త ఉద్యోగంలో చేరేకా వివేక్‌కి ట్రెనింగ్ ఇవ్వటానికి అనకాపల్లిలో అంతకు ముందే రిప్రజంట్ గా పని చేస్తున్న శ్యామ్‌ని కంపెని సేల్స్ మేనేజర్ నియమిస్తాడు. వివేక్ శ్యామ్‌ని అనకాపల్లి వెళ్ళి కల్సుకుంటాడు.
**వివేక్ :** మీరు శ్యామా ?
**శ్యామ్ :** ఔను మీరు ?
**వివేక్ :** నా పేరు వివేక్, కొత్త సేల్స్ రిప్రజెంటేటివ్‌గా నన్ను అపాయింట్ చేసారు, మిమ్మల్ని కల్సుకోవడం చాలా ఆనందంగా ఉంది.
**శ్యామ్ :** (లోపల ఉడికి పోతూ ఉంటాడు) పైకి వివేక్ నాకు కూడా నిన్ను కలవడం చాలా ఆనందంగా ఉంది. ఈ రోజు మనం మన కస్టమర్లను కలవబోతున్నాము. ఈ రోజు అంతా నువ్వు నాతో పాటు తిరిగి కొత్త విషయాలు తెలుసుకో
ఆ రోజు సాయంత్రం అవుతుంది.
**వివేక్ :** శ్యామ్ రేపు నేను సెలవు పెడతాను.
**శ్యామ్ :** ఎందుకు వివేక్,
**వివేక్ :** నాకు ఒక కంపెనీ నుండి ఇంటర్వ్యూకి కాల్ లెటర్ వచ్చింది. ఇంటర్వ్యూకి హైదరాబాద్ వెళ్ళాలి.
**శ్యామ్ :** ఈ విషయం మేనేజర్‌కి చెప్పు
**వివేక్ :** ఒకరోజే కదా, నువ్వు ఏదో ఒకటి చెప్పి మేనేజ్ చెయొచ్చుకదా, ఎల్లుండ నేను తిరిగి

వస్తాను.
**శ్యామ్ :** అలా కాదు మేనేజర్‌కి ఫోన్ చేసి చెప్పాల్సిందే.
**వివేక్ :** సరే మేనేజర్‌కి ఫోన్ చేస్తాను.
వివేక్ మేనేజర్‌కి ఫోన్ చేస్తే లిఫ్ట్ చేయడు.
**వివేక్ :** శ్యామ్ రేపు నేను రాను, ఇంటర్వ్యూకి హైదరాబాద్ వెళ్ళి వచ్చాకా నిన్ను కలుస్తాను.
వివేక్‌కి హైదరాబాద్‌లో ఇంటర్వ్యూ పూర్తి అవుతుంది.

వివేక్ నేను ఇంటర్వ్యూలో చక్కగా సమాధానాలు చెప్పాను, తప్పకుండా సెలక్టు అవుతాను. అనుకుంటూ తిరిగి ట్రైన్‌లో వైజాగ్ బయలుదేరుతాడు. ట్రైన్‌లో వివేక్ డోర్ దగ్గర నిలబడి ఉంటాడు. ఇంతలో ఏదో జరిగి వివేక్ బయటకి పడబోతుంటే ఒక చేయి వివేక్‌ని పట్టుకొని లోపలికి లాగుతుంది. మీరు డోర్ దగ్గర నిలబడితే పడిపోతారు, లోపలికి వచ్చి కూర్చోండి, అంటాడు. ఆ వ్యక్తి, వివేక్ వైజాగ్ చేరిన తర్వాత తన పాత ఉద్యోగంలో కంటిన్యూ అయ్యేందుకు శ్యామ్‌తో ఫోన్ ద్వారా మాట్లాడతాడు. శ్యామ్, వివేక్‌తో నువ్వు మేనేజరుతో మాట్లాడి విషయం తేల్చుకో అని చెబుతాడు

వివేక్ మేనేజర్‌కి వరసగా 3,4 రోజులు ఫోన్ చేస్తాడు, అయితే వివేక్ ఫోన్‌ని మేనేజర్ లిఫ్ట్ చేయకుండా కట్ చేస్తాడు.
వివేక్: సరే, ఈ ఉద్యోగం కాకపోతే మరొకటి, దీనికోసం బాదపడవలసిన అవసరం లేదు, అనుకొని రొటీన్ లైఫ్‌లో బిజి అయిపోతాడు.



వివేక్ ఇల్లు
**వెంగళప్ప :** వివేక్ నాకు నీరసంగా ఉన్నది. ఈ రోజు బుక్ షాపు నువ్వు తెరు.
**వివేక్ :** అలాగే నాన్న.
వివేక్ షాపులో కూర్చుని ఉండగా, వివేక్ బాల్య మిత్రుడు పరమ్ వస్తాడు.
**పరమ్ :** వివేక్ ఈ రోజు షాపు దగ్గర నువ్వు ఉన్నావు ఏమిటి ?
**వివేక్ :** ఇంటిదగ్గర ఒంటరిగా కూర్చుంటే హింస, ఇక్కడ ఏదైన హంస కనపడుతుందేమోనని వచ్చాను.
**పరమ్ :** నువ్వు బలే జోక్ చేస్తావు.
**వివేక్ :** ఔనా
**పరమ్ :** ఔను, నేను కూడా ఇంటికి వెళ్ళి పక్కింటి హంస కోసం చూస్తాను.
**వివేక్ :** హంసకోసం చూసి హింసలో పడతావేమో జాగ్రత్త.

ఇంతలో తెల్లని చీరలో నర్స్‌లా డ్రస్ వేసుకొని ఒకామె వివేక్ షాపుకి వస్తుంది.
తెల్లని చీరలో ఆమె: ఎక్స్క్యూజ్‌మీ
**వివేక్ :** చెప్పండి.

**ఆమె :** నాకు లేటెస్ట్ జి.కె. బుక్స్ కావాలి.
**వివేక్ :** ఇవి లేటెస్ట్ జి.కె. బుక్స్
**ఆమె :** ఎంత ?
**వివేక్ :** 60/–లు
**ఆమె :** నాకు 5 బుక్స్ ఇవ్వండి.
**వివేక్ :** ఇవిగోనండి.
**ఆమె :** 500/–లు ఇస్తుంది.
**వివేక్ :** ఆమెకు చేంజ్ ఇవ్వగా, చేంజ్ తీసుకొని వెళ్ళి పోతుంది.
**పరమ్ :** వివేక్ ఎంత అందంగా ఉంది ఈమె
**వివేక్ :** నేను సరదాగా హంస గూర్చి అంటే నిజంగానే హంస వచ్చినట్లుందే.
**పరమ్ :** వివేక్ రాత్రంతా ఈ హంస గూర్చి ఆలోచిస్తూ హింసపడు. పరమ్, వివేక్‌లు ఇద్దరు నవ్వుకుంటారు.



ఒక రోజు వివేక్ తన బుక్ షాప్ దగ్గర ఉండగా
**ఒక ఆమె :** నాకు ఒక నోట్ బుక్ ఇవ్వండి.
**వివేక్ :** తెలుపు రంగా, బ్రౌన్ రంగు బుక్కా, లాంగ్ బుక్కా, షార్ట్ బుక్కా.
**ఆమె :** 20/–లకు ఏ బుక్ వస్తే అది ఇవ్వండి.
**వివేక్ :** ఇది పట్టుకెళ్ళండి, పేజీలు ఎక్కువ, కాస్ట్ తక్కువ.
**ఆమె :** 20/–లు ఇచ్చి పుస్తకం తీసుకొని పోతుంది.
**సక్కుబాయి :** ఏయ్ రాణి, నిన్న నోట్ బుక్ కొనడానికి గాజువాక సెంటర్‌లో ఉన్న బుక్ షాప్‌కి వెళ్ళానే, షాపువాడు ఒక బుక్ గూర్చి అడిగితే నాలుగు రకాల బుక్స్ గూర్చి చెప్పాడు, వాడు చాలా తెలివైన వాడిలా ఉన్నాడు.
**రాణీబ్రహ్మణీ :** వాడు అంత తెలివైన వాడా ?
**సక్కుబాయి :** వాడు తెలివైన వాడిలాగానే ఉన్నాడు.
**రాణి :** ఎలాంటి వాడినైనా, నేను ఇట్టే బురిడి కొట్టిస్తా
**సక్కుబాయి :** వాడు అంత తేలికగా పడేలా లేడు
**రాణీబ్రహ్మణీ :** పందెమా, వాడిని మోసం చేస్తాను.
**సక్కుబాయి :** పందెం, నువ్వు మారని ఈ 20/–లు నోటుని ఆషాపు వాడి దగ్గర మార్చాలి. మార్చితే వాడిని నువ్వు బోల్తా కొట్టించినట్టు లేకపోతే నువ్వు పందెం ఓడినట్టు.
**రాణీబ్రహ్మణీ :** పందెం ఏంటి ?
**సక్కుబాయి :** నువ్వోడితే గుండు కొట్టించు కోవాలి, నువ్వుగెలిస్తే నేను గుండు కొట్టించుకుంటాను.
**రాణీబ్రహ్మణీ :** సరే పందెం

వివేక్ తన పుస్తకాల షాపులో కూర్చుని పుస్తకాలు చదువుకుంటూ ఉంటాడు.

**రాణిబ్రహ్మణి :** నాకు రెండు పెన్నులు ఇవ్వండి

**వివేక్ :** ఏ కలర్ పెన్స్ కావాలి ?

**రాణి బ్రహ్మణి :** బ్లూకలర్

**వివేక్ :** ఇవిగోనండి, రెండూ 20/–రూ.

రాణిబ్రహ్మణి 20/–రూ. నోటు ఇస్తుంది.

**వివేక్ :** 20/–లు నోట్ తీసుకొని, ఈ నోట్ మారదండి మరొక్కటి ఇవ్వండి.

**రాణిబ్రహ్మణి :** ఇది మారకపోవటం ఏంటి మారుతుంది.

**వివేక్ :** మీరు మరో నోటు ఇవ్వండి, ఇది మారదు.

**రాణిబ్రహ్మణి :** నేనిచ్చిన నోటు మారదు అంటున్నావు, నేనెవరో తెల్సా ?

**వివేక్ :** అయ్యోపాపం మీరెవరో మీకే తెలియదా ?

**రాణిబ్రహ్మణి :** వెటకారమా,

**వివేక్ :** వెట్ కారమూ లేదు, డ్రైకారమూ లేదు. పెన్స్ కావలిస్తే వేరే నోట్ ఇవ్వండి.

**రాణి బ్రహ్మణి :** అంటే నేనిచ్చిన నోట్ తీసుకోవా ?

**వివేక్ :** సారీ

**రాణిబ్రహ్మణి :** నీ సంగతి చూస్తా, రాణి మూతి ముపై వంకరలు తిప్పుకొని వెళ్ళిపోతుంది.

వివేక్ చిన్నపిల్లల చేష్టలా ఉంది అని నవ్వుకుంటాడు.

**సక్కుబాయి :** ఏమే రాణి, పందెం ఏమైంది వాడిని మోసం చేసావా ?

**రాణిబ్రహ్మణి :** వాడొక హిట్లర్, వాడిని చీటింగ్ చేయటం నా వల్ల కాలేదు.

**సక్కుబాయి :** ఐతే పందెం ప్రకారం గుండు కొట్టించుకో.

**రాణిబ్రహ్మణి :** పందెంలో ఎప్పుడూ నేను ఓడలేదు, వాడి అంతు చూస్తాను.



కిటికీ తలుపులు గాలికి కిట కిటా కొట్టుకుంటున్నాయి. ఇంతలో ఫోన్ మ్రోగుతున్నది.

**రాజేశ్వరి దేవి :** హల్లో

**రాణిబ్రాహ్మణి :** మమ్మీ వాడి దగ్గర ఓడిపోయేను.

**రాజేశ్వరి :** ఓడిపోయేవా ?

**రాణిబ్రాహ్మణి :** ఔను, అసలు వాడిలో ఏ ప్రత్యేకత ఉందని, వాడు నాకంటే ఎందులో ఎక్కువ ?

**రాజేశ్వరి దేవి :** తెలివిలో, పొగరులో

**రాణిబ్రాహ్మణి :** వాడిని ఓడిస్తా, పిచ్చివాడిని చేసి వాడి కుటుంబాన్ని రోడ్డుమీద పడేలా చేస్తాను.

**రాజేశ్వరి దేవి :** వాడిని న్యాయబద్ధంగా ఎప్పటికీ ఓడించలేవు.

**రాణిబ్రాహ్మణి :** మరి ఎలా

**రాజేశ్వరి దేవి :** వాడితో కాదు, వాడి బాబుని మోసం చేయి, ఆ వివేక్‌తో పందెం కాస్తే దేవుడే

దిగివచ్చినా ఓడించలేడు. తెలివిగా ఆలోచించు, వాళ్ళను ట్రాప్ చేయి.
**రాణి బ్రాహ్మణి :** వాడి నాశనానికి ఎన్ని అడ్డదారులైనా తొక్కుతా సరేనా
**రాజేశ్వరిదేవి :** నా గుండె మంట నువ్వు చల్లారుస్తావు అని ఆశిస్తున్నాను.
**రాణి బ్రాహ్మణి :** గుడ్‌నైట్ మమ్మీ
**రాజేశ్వరి దేవి :** గుడ్‌నైట్ తల్లీ



రామలింగా రెడ్డి, అతని కొడుకు అదితి రెడ్డి, అతని మేనల్లుడు శ్రీనివాసరెడ్డి మాట్లాడుకుంటుంటారు.
**రామలింగారెడ్డి :** నీకు అందరి అబ్బాయిలలా అమ్మాయిల పిచ్చి కాకుండా, ఈ అబ్బాయిల పిచ్చి ఏంటిరా ?
**అదితి రెడ్డి :** ఏమో నాకు అమ్మాయిల కంటే అబ్బాయిలు అంటేనే ఇష్టం నా ఫ్రెండ్ షబీర్‌కు కూడా అబ్బాయిలు అంటేనే ఇష్టం.
**శ్రీనివాసరెడ్డి :** బావా నీ కొడుకుది అమ్మాయిల పిచ్చికాదు. అబ్బాయిల పిచ్చి, ఈ రకం వాళ్ళను 'గే' అని అంటారు.
**అదితి రెడ్డి:** ఆ మధ్య ఒక బుక్ షాప్‌లో రఘు అనే కుర్రాడిని చూసాను, వాడు నాకు కావాలి.
**రామలింగారెడ్డి :** ఒరే అమ్మాయి అయితే తెప్పిస్తాను అబ్బాయిని అడిగితే ఎలా, ఊరిలో జనాలకు తెలిస్తే మన పరువు పోతుంది. తుప్పుకున ఉమ్మేస్తారు.
**శ్రీనివాసరెడ్డి :** బావా, దీనికి నేను ఏదో ఒక పథకం వేస్తాను కంగారు పడకు.



రామలింగారెడ్డి, అదితి రెడ్డి, శ్రీనివాసరెడ్డి ఒక హాలులో కూర్చుని ఉంటారు. అక్కడికి డా॥బొట్టు రామకృష్ణ, డా॥ఖాన్, డా॥శ్రీలక్ష్మి, బ్రహ్మం, షబీర్, డా॥రామరాజు, డా॥ భీమశంకరం, సురేంద్ర వర్మ ఒకరి తర్వాత ఒకరు వస్తారు.
**రామలింగారెడ్డి :** డా॥ బొట్టు రామకృష్ణ మీరు చెప్పినట్టు మన వాళ్ళని అందరినీ పిలిపించాను. నాకొడుకు అదితి రెడ్డి ఒక 'గే' వాడికి రఘు అనే అబ్బాయి కావాలట, ఏం చేయాలో మీ ప్లాన్ చెప్పండి ?
**డా॥బొట్టు రామకృష్ణ :** రామలింగారెడ్డిగారు, ఉత్తర ప్రదేశ్‌లో మా హెడ్ ఒక రీసెర్చ్ చేసారు. ఆ రీసెర్చ్ ఇక్కడ చేయాలని చేనాళ్ళనుంచి మేం చూస్తున్నాం. ఇపుడు టైమ్ కలిసి వచ్చింది. చాలా సం॥రాల క్రితం చేసిన ఆ రీసెర్చ్ మళ్ళీ ఇప్పుడు ఇక్కడ చేద్దాం. ఈ రీసెర్చ్ ద్వారా మీ అబ్బాయి రఘు వెంట పడ్డాడు అనే విషయం ప్రజలకు తెలియకుండా చేద్దాం
**రామలింగా రెడ్డి :** మీ హెడ్ ఎవరు ? ఏంటా రీసెర్చ్?
**డా॥ బొట్టు రామకృష్ణ :** మా హెడ్ ఎవరన్నది, ఎక్కడ ఉంటారు, ఎలా ఉంటారు అన్నది మాకు ఎవ్వరికి తెలియదు. మా హెడ్ మమ్మల్ని కలవాలి అనుకున్నప్పుడు ఒక బ్లాక్ కేట్ (నల్ల పిల్లి) ఆకారం స్క్రీన్ మీద కనిపించి మాతో సంభాషిస్తుంది. మాకు కావలసిన సూచనలు, తను

ఇవ్వదల్చిన కమేండ్స్ ఇస్తారు.

మా హెడ్‌తో త్వరలో మన అందరికి ఒక సమావేశం ఏర్పాటు చేస్తాను. ఇక రీసెర్చ్ గూర్చి మా హెడ్ చెబుతారు.



అది ఒక హాలు, హాలులో ఒక స్క్రీన్ ఉంటుంది. ఆ హాలులో ఉన్న అందరూ ఆ స్క్రీన్‌ని చూస్తు ఉంటారు. ఆ స్క్రీన్‌పై ఒక నల్లపిల్లి (బ్లాక్ క్యాట్) ప్రత్యక్షం అయ్యి ఇలా మాట్లాడుతుంది.

***బ్లాక్ క్యాట్ :*** గుడ్ ఈవినింగ్ ఫ్రెండ్స్, అయామ్ డా॥ సైకో, మన మీటింగ్‌కి అందరూ హాజరయ్యారా ?

***డా॥ బొట్టు రామకృష్ణ :*** ఎస్ డా॥ సైకో

***డా॥సైకో :*** రామలింగా రెడ్డిగారు, మీ అబ్బాయి 'గే' అని వాడు రఘు అనే అబ్బాయిని కోరుతున్నాడు అని మాకు తెల్సింది.

***రామలింగా రెడ్డి :*** ఇప్పుడేం చేయాలి.

***డా॥సైకో :*** రీసెర్చ్ చేయాలి.

***సురేంద్రవర్మ :*** ఏం రీసెర్చ్ డా॥ సైకో

***డా॥సైకో :*** బ్లూ బ్రైన్ రీసెర్చ్

***రామలింగారెడ్డి :*** అంటే?

***డా॥సైకో :*** మానవ బ్రైన్‌తో కమ్యూనికేషన్ అండ్ రోబోటిక్ రిమోట్ సెన్సింగ్. అనగా మానువుని బ్రైన్‌తో వైర్లెస్ కమ్యూనికేషన్ చేయగల్గటం. యూ.కె.లోని మా రీసెర్చ్ సెంటర్లో ఈ పరిశోధనలు జరిపాం. ఈ రీసెర్చ్‌ని టెస్ట్ ట్రయల్‌గా రఘు కుటుంబం మీద ప్రయోగించి రఘు కుటుంబాన్నే కాదు, ఊరు మొత్తాన్ని మన గుప్పెట్లో పెట్టుకోవచ్చు. ఈ రీసెర్చ్‌లో రెండు ప్రధాన అంశాలు ఉంటాయి. అవి మొదట బ్రెయిన్ స్కానింగ్ చేసి బ్రెయిన్ మ్యాపింగ్ చేయడం, రెండవది బ్రెయిన్ రీడింగ్ చేయటం. దీనినే బ్రెయిన్ కమ్యూనికేషన్ అంటారు. దీని ద్వారా ఒక వ్యక్తి ఆలోచిస్తున్నది. చూస్తున్నది మనం ప్రతిక్షణం తెల్సుకోవచ్చు, అలాగే మన మాటలను నేరుగా ఆ వ్యక్తి బ్రెయిన్‌కి చేరవేసి వినిపించవచ్చు. అయితే ఈ రీసెర్చ్ కోసం మనం ఒక చిన్న లోకల్ సమస్యను సృష్టించాలి.

***బ్రహ్మం :*** అయితే దీనికి నేనొక ప్లాన్ చెబుతాను వినండి. ఆచారి ప్లాన్ చెబుతాడు. అందరూ అలాగే చేద్దాము అని అంటారు.

***డా॥సైకో :*** ఈ ప్లాన్ అమలు చేయాలి అంటే మనకు ఒక స్థావరం కావాలి.

***రామలింగారెడ్డి :*** అది ఎక్కడ ఉంటే బాగుంటుంది డా॥ సైకో.

***డా॥సైకో :*** మన విశాఖనగరం మధ్యలో ఎఫ్.ఎం రేడియోస్టేషన్ పేరుతో ఒక స్టేషన్ ఏర్పాటు చేద్దాం, దాని క్రింద దానికి అనుబందంగా సరళ మెమోరియల్ హాస్పటల్ అనే పేరు మీద మన రీసెర్చ్ సెంటర్ నెలకొల్పుదాం. ఈ రీసెర్చ్‌ని ఫారినర్స్‌తో కల్సి చేసి ఫలితం సాధించేము,

ఇలాంటి రీసెర్చ్‌లు జర్గుతాయని ప్రజలు అసలు ఊహించరు. ఎవరైనా చెప్పినా నమ్మరు. ఈ విషవలయంలో ప్రజలు అందరినీ బందిద్దాము. మన రీసెర్చ్‌టీంలో సగం మంది డాక్టర్లు, మిగతాది బడా రాజకీయనాయకులు, వ్యాపారవేత్తలు, కొందరు పోలీసులు ఉన్నారని ఎవరికీ తెలియకూడదు.

**అదితి రెడ్డి :** మన రీసెర్చ్ గూర్చి ఎవరైనా తెల్సుకుంటే ?

**డా॥ఖాన్ :** వాళ్ళను పిచ్చివాళ్లగా ముద్ర వేద్దాం, నిజం చెబితే ఏక్సిడెంటల్‌గా చంపించి వేస్తాం.

**డా॥సైకో :** మన రీసెర్చ్ గూర్చి మన టీం సభ్యులకు తప్ప ప్రజలెవ్వరికీ తెలియకూడదు.

**సురేంద్రవర్మ :** మీడియాని కూడా తప్పుదారి పట్టిద్దాం. అసలు నిజం ఏమిటి అన్నది ఎవరికీ తెలియకూడదు. లోపల జరిగేది ఒకటి, మనం బయటకి చెప్పేది ఇంకొకటి.

**డా॥సైకో :** మన బ్రహ్మం ప్లాన్‌ని రేపటి నుండి అమలు చేద్దాం. సయనోరా.



బ్రహ్మం ప్లాన్ ప్రకారం మరుసటి రోజు......

వెంగళ్ళప్ప బుక్ షాపు తీసుకొని కూర్చుంటాడు. అంతలో బ్రహ్మం వచ్చి

**బ్రహ్మం :** ఎవరయ్యా ఇక్కడ రఘు అంటే ?

**వెంగళ్ళప్ప :** రఘు మా అబ్బాయి,

**బ్రహ్మం :** నీ కొడుకు రఘు మూలంగా నా కూతురు ఆత్మ హత్య చేసుకొని చనిపోయిందయ్యా

**వెంగళ్ళప్ప :** పొరబడుతున్నారు, మా అబ్బాయి రఘు మూలంగా మీ అమ్మాయి చనిపోవటం ఏంటి ?

**బ్రహ్మం :** ఇదిగో మీ అబ్బాయికి మా అమ్మాయి రాసిన ప్రేమలేఖలు, మీ అబ్బాయి నిరాకరించటం వల్లే మా అమ్మాయి ఆత్మహత్య చేసుకొని చనిపోయింది.

**వెంగళ్ళప్ప :** మా అబ్బాయి అలాంటి వాడు కాదండి.

**బ్రహ్మం :** మీ అబ్బాయి ఎలాంటివాడో నాకుతురు ప్రేమను నిరాకరించడాన్ని బట్టి తెలుస్తుంది. వాడు మగాడా? నపుంసకుడా ? వాడి అంతు చూస్తా. నా కూతురు మరణానికి ప్రతీకారం తీర్చుకుంటా. నీకొడుకు ఒప్పుకొని ఉంటే నా కూతురు బ్రతికేదే. అయ్యో నా కూతురా, ఒక నపుంసకుడిని ప్రేమించి మరణించేవా తల్లీ, వేసవికాలంలో నీకు ఎ.సి. నయ్యేనే, వర్షాకాలంలో గొడుగు నయ్యేనే తల్లి, నన్నొదిలి వెళ్ళిపోయేవా ?......... అని కల్లబొల్లి ఏడుపులు ఏడుస్తూ అక్కడి నుండి వెళ్ళిపోతాడు.

వెంగళ్ళప్ప ఈ విషయం వివేక్, రఘులకుగాని ఇతర బందు, మిత్రులకు గాని చెప్పకుండా దాచుతాడు. కొన్ని రోజుల తరువాత, వెంగళ్ళప్ప భోజనం చేసి ఇంటి దగ్గర విశ్రాంతి తీసుకుంటుంటాడు. రఘు, వివేక్‌లు ఆసమయంలో ఇంటి దగ్గర ఉండరు.

రామలింగారెడ్డి కొడుకు 'గే' అయిన అదితి రెడ్డి, షబీర్ అనే మరో 'గే'ను వెంటబెట్టుకొని అక్కడకు వస్తాడు.

**వెంగళ్ళప్ప :** ఎవరు మీరు ?

**అదితి రెడ్డి :** నేను రామలింగారెడ్డి కొడుకు అదితిరెడ్డి, వీడు షబీర్, మేం మీ అబ్బాయిని ప్రేమించాము.

**వెంగళ్ళప్ప :** అబ్బాయిలు అబ్బాయిని ప్రేమించటం ఏంటి ? మీరు పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నారు.

**అదితి రెడ్డి :** చూడండి వెంగళప్పగారు, మేం ఈ వూరిలో పెద్దమనిషి పిల్లలం, మా విషయం భయటికి తెలియకూడదు, మీరే మీ అబ్బాయిని ఒప్పించాలి.

**వెంగళప్ప :** ఏంటిరా లం. కొడకా ఏం వాగుతున్నావ్.

**అదితి రెడ్డి :** ఏయ్ ముసలాడా నీకొడుకు పెళ్ళి కాకుండా మాతోనే జీవితాంతం ఉండాలి.

**వెంగళప్ప :** పళ్ళురాలతాయి, ముందు ఇంటిలోంచి బయటకు వెళ్ళండి.

**షబీర్ :** రేపు వస్తాం, మేం చెప్పిన దానికి నువ్వు ఒప్పుకోవాలి.



మరుసటిరోజు షబీర్ ఓ ఇద్దరు ఫ్రెండ్స్‌తో కల్సి వెంగళప్ప ఇంటికి వస్తాడు.

**వెంగళప్ప :** మళ్ళీ ఎందుకు వచ్చేవు ?

**షబీర్ :** నీ కొడుకుని ప్రేమించాను అని చెప్పాను కదా నీ కొడుకుని ఒప్పుకోమను.

**వెంగళప్ప :** మగాడిని, మగాడు ప్రేమించటం ఏంటిరా ఇలాంటి పనులకు ససేమిరా ఒప్పుకోను.

**షబీర్ :** నువ్వు ఒప్పుకోకపోతే నేను ఎండ్రిన్ త్రాగి చస్తాను.

**వెంగళప్ప :** నీ చావు నువ్వు చావు.

**షబీర్ :** తన వెంట తెచ్చుకొన్న నకిలీ ఎండ్రిన్ త్రాగి నురగలు కక్కుతూ క్రిందపడి గిలగిలా కొట్టుకుంటాడు.

షబీర్‌తో వచ్చిన ఫ్రెండ్స్, మా షబీర్‌ని చచ్చిపోమన్నావు. వీడికి ఏమైనా అయితే నిన్ను, నీ కొడుకుని బ్రతకనివ్వం అని షబ్బీర్‌ని తమ కారులో కూర్చోబెట్టుకొని హాస్పటల్‌కి తీసుకువెళ్తామంటూ చెప్పి, కారు దారిలో ఆపి నిజం ఎండ్రిన్ షబీర్‌కి పట్టించి షబీర్‌ను చంపివేస్తారు. ఇదంతా అదితి రెడ్డి పథకం ప్రకారం జర్గుతుంది.

షబీర్ ఎండ్రిన్ తాగి మరణించాడు. దానికి వెంగళప్ప కారణం అని అదితి రెడ్డి తన అనుచరుల ద్వారా షబీర్ కుటుంబానికి చెప్పిస్తాడు.

షబ్బీర్ కుటుంబ సభ్యులు తమ అనుచరులతో షబ్బీర్ మరణానికి వెంగళప్ప, రఘులే కారణం అనుకొని వెంగళప్ప ఇంటికి గొడవకు వస్తారు.

నిజం తెలియని వెంగళప్ప షబ్బీర్ తన వల్లే చనిపోయేడని భావించి వాళ్ళకు భయపడి వాళ్ళు ఏది చెబితే అది వింటాను అని అంటాడు. షబ్బీర్ కుటుంబ సభ్యులు వెంగళప్పతో ఇక మీదట మీ రఘు వంక ఏ అమ్మాయి చూసినా, లేక రఘు ఏ అమ్మాయి వంక చూసినా గుండుకొట్టిస్తాం, ఆ అమ్మాయిని రేప్ చేస్తాం అని బెదిరించి, ఈవిషయం బయట ఎవ్వరికి చెప్పకూడదని వార్నింగ్ ఇచ్చి వెళ్ళిపోతారు.

ఇది జరిగిన కొన్ని రోజులకు అదితి రెడ్డి తన అనుచరుడు శాలి రాజేష్ అనే వాడిని అమ్మాయి వేషం వేయించి వివేక్, రఘు లేని సమయంలో వెంగళప్ప ఇంటికి పంపిస్తాడు.

శాలి రాజేష్ అమ్మాయి వేషం వేసుకొని, తన అన్నయ్యగా ఒకడిని వెంటబెట్టుకొని వెంగళప్పను కలుస్తాడు. శాలి రాజేష్ వెంగళప్పతో నీ కొడుకును ప్రేమించాను. ఇల్లు వదిలి వచ్చేశాను అని తన అన్నయ్యగా చెప్పినవాడి సహాయంతో దొంగనాటకం ఆడుతాడు. వెంగళప్ప వచ్చినది అమ్మాయి అనుకొని అంతకు ముందే షబ్బీర్‌తో గొడవ వుండటంతో ఈ ప్రేమ గీమతనకు నచ్చవని తెగేసి చెబుతాడు. అమ్మాయి వేషంలోని శాలి రాజేష్ వెంగళప్పతో నువ్వు కాదంటే తిరిగి నేను ఇంటికి వెళ్ళను, నీ కొడుకును ప్రేమించి ఇల్లు వదిలి వచ్చేశాను అంటూ ఆడగొంతుతో రాగాలు తీస్తాడు. వెంగళప్ప ఆవేశంలో నువ్వు ఎలా పోతావోపో అంటాడు. అమ్మాయి వేషంలోని శాలి రాజేష్ తన అన్నయ్యగా వెంట తీసుకొచ్చిన వాడితో అక్కడి నుండి వెళ్ళిపోతాడు.

ఆమరుసటి రోజు అమ్మాయి వేషం వేసిన శాలిరాజేష్ అనేవాడి తండ్రిని, అని ఒకడు, అమ్మాయి అన్నయ్యగా నట్టించిన వాడిని వెంటబెట్టుకొని వెంగళప్ప ఇంటికి వస్తాడు. నా కూతురు మీ రఘుని ప్రేమించి నటు లేఖరాసి ఇల్లు వదిలి వెళ్ళిపోయింది. రఘుకి నా కూతురితో సంబంధం ఉంది, నా కూతురి అదృశ్యం వెనుక రఘు హస్తం ఉందని ఆరోపిస్తూ దొంగనాటకం ఆడి, పెద్దలులో ఈ విషయం తేల్చుకుందాం రా అని వెంగళప్పను, తనను అక్కడికి పంపించిన దొంగ పెద్దలు అయిన సురేంద్రవర్మ, రామలింగారెడ్డి, డా॥బొట్టురామకృష్ణ, డా॥ఖాన్, భీమశంకరం, డా॥శ్రీలక్ష్మి లాంటి పెద్దల దగ్గరకు తీసుకు వెళ్తాడు.

అక్కడ వెంగళప్పను కూర్చోబెట్టి వాళ్ళు తీయగా మాట్లాడి అదృశ్యం అయిన అమ్మాయిని వెతికి పట్టుకుందాం అని, బయట ఈ విషయం తెలిస్తే అల్లరి అవుతాం అని, ఇంటిలో సహా ఎవ్వరికీ చెప్పవద్దని వెంగళప్పకు చెబుతారు. వాళ్ళ మోసం తెలియని వెంగళప్ప అది నిజం అనుకొని ఇంటికి వస్తాడు.



ఒక రోజు ఆనంద్ ఇంటికి వచ్చేసరికి, ఆనంద్ ఫ్రెండ్ వివేక్ తమ్ముడు రఘు, ఆనంద్ చెల్లెలు నవీనలు మాట్లాడుతుంటారు.

**రఘు :** నవీన ఇంకెన్నాళ్ళు మనం ఇలా దూరంగా?

**నవీన :** మన ప్రేమ వ్యవహారం అన్నయ్యకి చెప్పు రఘు

**రఘు :** మా అన్నయ్యకా

**నవీన :** మీ అన్నయ్య, నువ్వు ప్రేమ అంటే ఆయన దోమ అనుకొని దోమ జీవితచక్రం గూర్చి చెబుతాడు. ఆయనతో బాధించుకునే కంటే మా అన్నయ్యకి చెప్పు

**రఘు :** మీ అన్నయ్యతో ప్రేమ అంటే వెంటనే, పెళ్ళికి ససేమిరా అంటాడేమో.

**నవీన :** మరెలా

**రఘు :** ఇలా, అంటూ నవీన కళ్ళలోకి కళ్ళు పెట్టి చూస్తూ ఉంటాడు.
ఆనంద్ ఇంతలో అక్కడికి వచ్చి
**ఆనంద్ :** రఘు, నవీన
రఘు, నవీనలు ఈ లోఖంలోకి వస్తారు, నవీన లోపలి గదిలోకి పారిపోతుంది.
**ఆనంద్ :** నవీన బయటికిరా, అలా లోపలికి పారిపోతావేం. నవీన లోపలినుంచి బయటకి వస్తుంది.
**ఆనంద్ :** రఘు అంటే నీకిష్టమా నవీన
**నవీన :** అవును అన్నయ్య
**ఆనంద్ :** రఘు మరి నీకు
**రఘు :** నాకు నవీన అంటే ఇష్టమే.
**ఆనంద్ :** సరే మీ ఇద్దరి ప్రేమ నాకు ఇష్టమే. రఘు నేను మీ నాన్నగారితో మాట్లాడుతా, ఈలోపులో నాకు మేనల్లుడిని ఇవ్వకు. అంతా నవ్వుకుంటారు.

ఒక రోజు ఆనంద్, వివేక్ తండ్రి వెంగళప్పను కలిసి రఘుతో తన చెల్లెలు నవీన పెళ్ళి విషయం మాట్లాడేందుకు వెళ్ళతాడు. ఆ సమయంలో వివేక్ ఇంటి దగ్గర ఉండడు.

వెంగళప్ప రఘు వివాహ విషయంలో ఒక భయంకర రహస్యం ఆనంద్‌తో చెబుతాడు. స్థానిక రాజకీయ నాయకుడు రామలింగారెడ్డి కొడుకు అదితి రెడ్డి 'గే' అని, వాడు రఘు మ్యారేజి విషయంలో అడ్డుపడుతున్నాడుఅని ఎవరికీ ఈవిషయం తెలియకూడదని బెదిరించేడు అని చెబుతాడు. వెంగళప్ప ఆ విషయాన్ని రహస్యంగా ఉంచాలని ఆనంద్ దగ్గర మాటతీసుకుంటాడు. ఆనంద్ ఎలాగైనా తన చెల్లెల్ని రఘుకి ఇచ్చి పెళ్ళి చేయాలని అనుకొని ఈ విషయాన్ని చాలెంజ్‌గా తీసుకుంటాడు. ఆనంద్ రామలింగారెడ్డి కొడుకు 'గే' అయిన అదితి రెడ్డి వివరాలు సేకరిస్తూ అనుకోకుండా వాళ్ళ బ్రెయిన్ రీసెర్చ్ ప్లాన్ గూర్చి తెల్సుకుంటాడు. ఆనంద్ ఆ విషయాలు తన మరో స్నేహితుడు ఆస్ట్రేలియాలోని భరత్‌కు తెలుపుతూ అతని సలహాలు తీసుకుంటుంటాడు.

ఒక రోజు వివేక్ మరో ఇంటర్వ్యూకి వెళ్ళి తిరిగి వైజాగ్ చేరుకుంటాడు. ఇంతలో వినకూడని ఒక విషయం వివేక్ వినవలసి వస్తుంది. వివేక్ స్నేహితుడు ఆనంద్, వైజాగ్ ప్రక్క ఊరు భీమిలిలో ఉంటాడు. వివేక్ వైజాగ్ వచ్చేసరికి ఆనంద్ చెల్లెలు రేప్ చేయబడి, చంపబడి ఉంటుంది. ఆనంద్ ఆ విషయం బాధతో వివేక్‌కి ఫోన్లో తెలియజేస్తాడు. వివేక్ ఆనంద్ ఊరు భీమిలి వెళ్ళతాడు.
**వివేక్ :** ఆనంద్ ఏమిటి ఈ దారుణం ఎలా జరిగింది?
**ఆనంద్ :** నేను ఇంటిలో లేని సమయంలో ఎవరో దుర్మార్గులు ఈ పని చేసారు. నేను మా చెల్లి తప్ప మాకు ఎవరూ లేరని నీకు తెలుసుగా ?
**వివేక్ :** బాదపడకు, నిజం నిలకడమీద తెలుస్తుంది. జరిగిన సంఘటన నాకు చాలా బాద

కల్గిస్తుంది.

**ఆనంద్ :** వివేక్ నా చెల్లి మరణానికి కారణం అయిన వారిని అంతు చూడకుండా వదలను.

**వివేక్ :** నీ కోసం నేను నా చేతనైన సాయం చేస్తాను, ముందు ఈ సంఘటనకు సంబంధించిన వివరాలు మనం తెల్సుకోవాలి.

**ఆనంద్ :** నేరస్తులను పట్టుకోగలమా వివేక్?

**వివేక్ :** ఎలాంటి నేరస్తుడైనా ఏదో ఒక పొరపాటు చేసి ఒక క్లూ వదులుతాడు. ఆనంద్ నువ్వు కంగారు పడకు, ఈ విషయం ఛేధించేందుకు నేను ప్రయత్నిస్తాను.

**ఆనంద్ :** థ్యాంక్స్ వివేక్, నీ మాటలతో ఈ ప్రపంచంలో నా కంటూ ఒకరు సహాయం చేయటానికి ఉన్నారు అనిపించి ధైర్యం కల్గుతుంది.

**వివేక్ :** సరే నేను అలా ఊరిలోకి వెళ్ళి వస్తాను.

వివేక్ ఆ గ్రామంలో నలుమూలలలో తిరుగుతాడు. అప్పుడు కొన్ని విషయాలు తెల్సుకుంటాడు. ఆ గ్రామంలోకి ఆనంద్ చెల్లెలు మరణించిన రోజు నలుగురు కొత్త వ్యక్తులు వచ్చేరు అని, వాళ్ళు డ్రగ్స్ మత్తులో ఊగుతూ గ్రామం చివర గెస్ట్‌హౌస్‌లో గడిపి మరునాడు వెళ్ళిపోయేరు అని.

రోజులు గడుస్తుంటాయి

వివేక్ వాళ్ళ బుక్‌షాప్‌కి వెళ్ళి వ్యాపారం చేసుకుంటుంటాడు. ఒక రోజు వివేక్ ఇంటిలో లేని సమయంలో ఆనంద్, వివేక్ ఇంటికి వచ్చి వివేక్‌కి ఇవ్వమని బుక్‌లో పెట్టి ఒక సీల్డ్ కవర్ వివేక్ తండ్రి వెంగళప్పగారికి ఇచ్చి వెళతాడు. ఆ తర్వాత వెంగళప్పగారు వివేక్‌కి అది ఇవ్వటం మరచిపోతాడు.

ఆరోజు ఆదివారం వివేక్‌కి ఏమి ఊసుపోక తన ఫ్రెండ్ సుబ్బు ఇంటికి వెళ్ళతాడు.

**వివేక :** సుబ్బు, సుబ్బు ఏమి చేస్తున్నావురా?

**సుబ్బు :** మా ఇంటిపైకి ఎక్కి ఎన్ని పెంకులు ఉన్నాయో లెక్కపెడుతున్నాను.

**వివేక్ :** ఏరా

**సుబ్బు :** మా ఆవిడ తిడుతున్న ప్రతిసారి పెంకు లేచిపోద్ది అంటుంది. అందుకే ఎన్ని పెంకులు లేచేయో చూస్తున్నా.

**వివేక్ :** అమాయకుడా, పెంకు లేచిపోద్ది అంటే ఇంటి పెంకు కాదురా,

**సుబ్బు :** మరి ఏ పెంకు?

**వివేక్ :** నీ తల పెంకు

**సుబ్బు :** నేను నీలాగే జోక్ చేసాను లేరా

**వివేక :** నాలా జోక్స్ వేయకు.

**సుబ్బు :** ఏం

**వివేక్ :** నేనా బ్రహ్మచారిని, జోక్స్ వేసినా పర్వాలేదు. పెళ్లైన నీకు జోక్స్ వేసే స్వేచ్ఛ పోయింది. నువ్వు నాలా జోక్స్ వేస్తే మీ ఆవిడ నీ వీపు విమానం మోత మోగిస్తుంది. అప్పుడు నిజంగానే నీతల పెంకు లేచిపోద్ది.

సుబ్బు, వివేక్ నవ్వుతూ మాటలాడుతుంటారు, ఇంతలో వివేక్‌పై ఒక బల్లి పడుతుంది.

**సుబ్బు :** వివేక్ బల్లి మీద పడితే అపశకునం, ఇంటికి వెళ్ళి స్నానం చేయి.

**వివేక్ :** నాకు ఇలాంటి మూడ నమ్మకాలు లేవు. నీకుంటే నా బదులు నువ్వు స్నానం చేసి ముక్కు పట్టుకొని మమ అనుకో.

**సుబ్బు :** అప్పుడప్పుడు నువ్వు చాలా విచిత్రంగా మాట్లాడతావ్ వివేక్.

**వివేక్ :** నిజాలు చాలా విచిత్రంగానే ఉంటాయి సుబ్బు. లేకపోతే ఏంటి, ఈ రోజులలో కూడా పాత చింతకాయ పచ్చడిలా బల్లి పడితే, స్నానాలు జపాలు. సరే నేను ఇంటికి వెళ్ళుతున్నా బాయ్.

వివేక్ ఇంటికి వెళ్ళతాడు, ఇంటి దగ్గర వాళ్ళ అమ్మ వెంకమ్మ, వివేక్ గురించి ఎదురు చూస్తుంది.

**వెంకమ్మ :** వివేక్ వచ్చేవా, నీకోసమే ఎదురు చూస్తున్నా,

**వివేక్ :** ఏమైంది అమ్మా ?

**వెంకమ్మ :** మీ తమ్ముడికి ఏమి అయ్యిందో తెలియదు, వళ్ళంతా చల్లబడిపోయి, చెమటలు పట్టి, నీరసంతో కళ్ళు తిరిగిపడిపోయేడు.

**వివేక్ :** సరే వాడికి ముందు గ్లూకోజ్ నీళ్ళు తాగించు అని అంటుండగా జూ,జూ,జూ, అని ధ్వని ఎక్కడి నుండో వినిపించి వినిపించనటు వినిపిస్తుంది. వివేక్ తమ్ముడికి గ్లూకోజ్ నీళ్ళుపట్టిస్తాడు. వివేక్ తమ్ముడు రఘు మేలుకొంటాడు.

**వివేక్ :** రఘు నీకు ఏమైంది.

**రఘు :** ఏమో తెలియదు అన్నయ్య, నాకు అప్పుడప్పుడు, ఇలా జర్గుతుంది.

**వివేక్ :** ఇది ఆలోచించాల్సిన విషయం.



వివేక్ ఇంటిలో లేని సందర్భంలో నలుగురు వ్యక్తులు వివేక్ ఫ్రెండ్స్ అని చెప్పుకొని వివేక్ ఇంటికి వస్తారు.

**వివేక్ తండ్రి వెంగళప్ప :** ఎవరు బాబు మీరు ?

**ఆ నలుగురు వ్యక్తులు :** మేము వివేక్ ఫ్రెండ్స్.

**వెంగళప్ప :** వివేక్ ఇంటిలో లేడు, బయటకి వెళ్ళాడు.

**ఆ నలుగురు :** మేము వివేక్ వచ్చేవరకు వెయిట్ చేస్తామండి

**వెంగళప్ప :** అలా కూర్చోండి.

**నలుగురు వ్యక్తుల్లో ఒకరు :** మీది బుక్ బిజినెస్ కదా?

**వెంగళప్ప :** ఔను, నాకు వివేక్‌కి బుక్స్ అంటే చాలా ఇష్టం, మా ఇంటిలోనే చిన్న లైబ్రరీ

లాంటిది ఉంది.

**నలుగురు వ్యక్తులు :** వివేక్ వచ్చే లోపల మీ లైబ్రరీ బుక్స్ మేము చూడవచ్చా?

**వెంగళప్ప :** పుస్తకాలు అంటే మీకు ఎంత అభిమానం, మా లైబ్రరీ బుక్స్ మీరు చూస్తుండండి.

వెంగళప్ప వాళ్ళకి టీ ఇచ్చేందుకు ఇంటిలోకి వెళ్తాడు. నలుగురు వ్యక్తులు గబగబా వెంగళప్ప లైబ్రరీ, ఇంటి గదులు వెతికి, అక్కడ దొరికిన సీల్డు కవరు పట్టుకొని, దానిని తమ బ్యాగ్‌లో దాచుకొని వెంగళప్పని పిలిచి, సార్ మేము మళ్ళీ వివేక్ ఉన్నపుడు వచ్చి కలుస్తాము, వివేక్ రావటానికి లేట్ అయ్యేలా ఉంది, అని చెప్పి వెళ్ళిపోతారు.

వివేక్ బుక్‌షాప్ కట్టేసి తన ఇంటికి రాత్రి 10:00గం॥ ప్రాంతంలో వస్తాడు.

**వెంగళప్ప :** వివేక్ నీ గురించి ఎవరో ఫ్రెండ్స్ సాయింత్రం వచ్చేరు. నువ్వు లేవని తెల్సి మళ్ళీ వస్తామని చెప్పి వెళ్ళిపోయేరు.

**వివేక్ :** నా ఫ్రెండ్స్ అని ఇంటికి ఎవరు వచ్చేరబ్బా ?



మరుసటి రోజు పొద్దున్నే వివేక్ పేపర్ చదువు తున్నాడు. పేపర్లో గత రాత్రి జరిగిన రోడ్డు ప్రమాదంలో ఆనంద్ అనే వ్యక్తి మరణించి నట్టు న్యూస్ ఉంటుంది.

**వివేక్ :** ఓహ్ మై గాడ్, ఆనంద్ ఏక్సిడెంట్‌లో మరణించాడా, అస్సలు నమ్మలేకపోతున్నాను. ఇది ఎలా జరిగింది. చెల్లెలు మరణంతో బాధపడుతున్న ఆనంద్ ఏక్సిడెంట్‌లో మరణించడమా, చూస్తుండగానే కాలం వేసిన గేలానికి నా స్నేహితుడు, అతని చెల్లెలు మరణించారు అనుకొని వివేక్ మౌనంగా దు:ఖాన్ని దిగమింగుతాడు. ఆనంద్ మరణాన్ని వివేక్ మరచిపోతూ కాలం గడుపుతుంటాడు. రోజులు దొరులుతూ ఉంటాయి.

వివేక్ నిద్రపోతుంటాడు. వివేక్‌కి నిద్రలో ఒక కల చిలిపిగా నవ్వుతూ తనని చూస్తున్న రెండు కళ్ళని చూస్తుంటాడు.

ఇంతలో వివేక్ తండ్రి కేకలు:

**వెంగళప్ప :** ఒరే మొద్దు, నిద్రలే, తెల్లారింది, సోమరిపోతులా తయారయ్యావు, ఆ కేకలకి వివేక్ నిద్రలేస్తాడు. ఇంతలో రఘు నిద్రలేచి

**రఘు :** అన్నయ్యా ఇవాళ ఆదివారం కదా, అమ్మతో చెప్పి చికెన్ జాయింట్స్ రోస్ట్ చేయించుకొని తిందామా.

**వివేక్ :** ఒరే నాకు పుస్తకాల పిచ్చి, నీకు తిండి పిచ్చి, నాన్నకు చెప్పుడుమాటలు వినే పిచ్చి, అమ్మకి సొల్లు కబుర్లు పిచ్చి, కొంత కాలానికి మన యిల్లు పిచ్చివాళ్ళ ఇల్లు అవుతుందేమో.

**రఘు :** అది కాదు అన్నయ్యా, నాకు చికెన్ జాయింట్స్ అంటే ఇష్టం, అందుకే ఇలా అడిగేను.

**వివేక్ :** నీ ఇష్టం వచ్చినది తెచ్చుకో, నీకావలసింది తిను. మధ్యలో నన్ను కలుపకు

**రఘు :** అన్నయ్యా మైక్రోఓవెన్‌లో చికెన్ జాయింట్స్ పెడితే రోస్ట్ అవుతాయి కదా, అది ఎలా జరుగుతుంది.

**వివేక్ :** ఒరే ప్రొద్దున్నే నాకు ఈ హింస ఏంటిరా ? వచ్చీరాని పాఠాలు చెప్పుకొంటూ స్కూలులో పిల్లలతో కాలక్షేపం చేస్తుంటే, ఆదివారం పూట కూడా, నాకు రెస్ట్ లేకుండా నీ ప్రశ్నలు ఏమిటి ?

**రఘు :** నువ్వు ఏది అడిగినా చెబుతావు అనుకుంటే ఇలా అంటావేంటి అన్నయ్య ?

**వివేక్ :** మైక్రోవేవ్ ఓవెన్‌లో మనం ఏదైనా ఉడికించాలి అంటే విద్యుత్ శక్తి ద్వారా మైక్రోవేవ్స్ అనేవి ఉత్పత్తి చేసి వేడి పుట్టించడం జరుగుతుంది. ఈ పద్ధతిలో మంటపెట్టకుండా తినే ఆహారపదార్థాన్ని చక్కగా ఉడికించడం అన్న మాట. ఇక్కడ కంటికి మంట, వేడి కనిపించవు.

**రఘు :** అలాగా

**వివేక్ :** రేడియో, సెల్‌ఫోన్, లాంటివి పని చేయాలి అంటే కంటికి కనిపించని కొన్ని తరంగాలు(వేవ్స్) వాటిని చేరాలి. అప్పుడు అవి పని చేస్తాయి. మైక్రోవేవ్ ఓవెన్‌లో కూడా అదే జర్గుతుంది. ఓవెన్ లోపల మైక్రోవేవ్స్ ఉత్పత్తి అయ్యి లోపల ఉన్న పదార్థంపై ప్రసరించటం వల్ల పదార్థం ఉడుకుతుంది. ఇంకా ఈ మైక్రో ఓవెన్‌ని ఎవరు కనిపెట్టేరు అంటే......

**రఘు :** వద్దు బాబోయ్ చెప్పోద్దు. చాలు అన్నయ్య నీ పాఠం నేను వినలేను, మైక్రో ఓవెన్‌లో చికెన్ ఎలా రోస్ట్ అవుతుందో తెలియదు, కాని నా బ్రైన్ ని రోస్ట్ చేస్తున్నావు. జీవితంలో నీ దగ్గర చికెన్ గూర్చి చికెన్ జాయింట్స్ గూర్చి ఇంకెపుడు అడగను.



**వివేక్ :** నేను చెప్పేది వినరా

**రఘు :** మీ స్కూల్‌లో ఉండే చిన్న పిల్లలకు చెప్పుకో నన్ను వదిలేయి.

**వెంకమ్మ :** ఏంటిరా వివేక్, తమ్ముడు అలా పారిపోతున్నాడు ?

**వివేక్ :** రఘుకి ఏదో డౌట్ వచ్చింది, చెబుతూ ఉంటే సగం విని పారిపోతున్నాడు, దీనినే హాఫ్ నాలడ్జ్ అంటారు.

**వెంకమ్మ :** అంటే ఏంటిరా ?

**వివేక్ :** ఒక ఇల్లాలికి గారెలు వండాలి అనిపించిందట, ఆమెకు వండటం రాదు, పక్కింటి ఆవిడ దగ్గరకు వెళ్ళి గారెలు ఎలా వండాలి అని అడిగిందట, ఆమె పప్పు ముందు నానపోయాలి అన్నది. వెంటనే ఆ ఇల్లాలు నాకు తెలిసింది, తెలిసింది అని ఇంటికి వెళ్ళి పప్పు నాన పోసి తరువాత ఏమిచేయాలో తెలియక మళ్ళీ పక్కింటావిడ దగ్గరకు వెళ్ళి ఏమి చేయాలి అని అడిగిందంట. ఆవిడ పిండి రుబ్బాలి అనగానే మళ్ళీ ఆమె నాకు తెలిసింది అంటూ వెళ్ళటం, సగం తెలుసుకోవటం తర్వాత ఏమి చేయాలో తెలియక పక్కింటావిడను అడగటం, చివరకు ఆమె ఎలాగోలా గారెలు వండిందట, ఆమె వండిన గారెలు తిన్న వాళ్ళ ఆయన ఏమయ్యాడో ఆ భగవంతుడికే తెలియాలి. దీనినే హాఫ్ నాలడ్జ్ అంటారు.

**వెంకమ్మ :** నీ పిట్టకథలు సంగతి తరువాత గాని మీ నాన్నకు గారెలు అంటే ఇష్టంరా ఈ రోజు గారెలు వేస్తాను.

**వివేక్ :** అమ్మా పక్కింటావిడ దగ్గరకు మాత్రం వెళ్ళి అడగకు, నీ ప్రయోగంతో నాన్నని ఈ వయస్సులో బాదపెట్టకు.



అది ఆస్ట్రేలియాలోని కాన్‌బెర్రా నగరం.

**భరత్ :** గోపికా, గోపికా వైజాగ్ నుంచి మీ నాన్న ఫోన్ చేసారా?

**గోపిక :** ఇంకా ఫోన్ చేయలేదు.

**భరత్ :** సరే, ఈ సండే “రాత్రి తిరిగే దెయ్యం” అనే సినిమా చూద్దామా ?

**గోపిక :** మిమ్మల్ని రోజూ చూస్తూనే ఉన్నా కదా, కొత్తగా రాత్రి తిరిగే దెయ్యాన్ని చూడాలా.

**భరత్ :** నువ్వు రాత్రి మాత్రమే చూస్తున్నావు నేను పగలు ఆఫీసులోను, రాత్రి ఇంటిలోనూ కూడా పిల్ల దెయ్యాన్ని, తల్లి దెయ్యాన్ని చూస్తున్నాను.

**గోపిక :** లాస్ట్ ఇయర్ మీ అమ్మా, నాన్న కూడా ఈ ఇంటిలోనే ఉన్నారు కదా.

**భరత్ :** మా అమ్మా, నాన్నల కంటే ముందే మీ అమ్మా, నాన్నలు వచ్చేరు కదా?

**గోపిక :** మీతో మాటలాడటం కష్టం

**భరత్ :** ఓ.కె. గోపికా, నేను అలా ఆఫీసు వరకు వెళ్ళివస్తాను.

**గోపిక :** ఈ టైమ్ లోనా ?

**భరత్ :** మా కంపెనీ వెబ్‌సైట్స్ హ్యాక్ అయ్యాయి, అందు కోసం ఆఫీసుకి వెళ్ళాలి. గుడ్‌నైట్

గోపికా. పాప జాగ్రత్త.

**గోపిక :** బాయ్, బోయ్

**భరత్ :** బాయ్ అమ్మాయ్.

మరుసటి రోజు, ఫోన్ మ్రోగుతుంది.

**గోపిక :** హల్లో

**అవతలి గొంతు :** హల్లో మేము జె.బి. హాస్పటల్ నుండి మాట్లాడుతున్నాము. మీరు మిస్సెస్ భరత్ నా

**గోపిక :** ఔను మీరు ఎవరు ?

**అవతలి గొంతు :** నేను జె.బి. హాస్పటల్ పి.ఆర్.ఒ ని మాటలాడుతున్నాను. ఈ తెల్లవారుజామున జరిగిన రోడ్డు ప్రమాదంలో మీ భర్త మరణించారు, వచ్చి బాడీ కలెక్ట్ చేసుకోండి.

**గోపిక :** నిజమా, నేను, నేను నమ్మలేను. గోపిక మాటలు రాక కన్నీళ్ళ సంద్రంలా మారి తన 5సం॥ల పాపని హత్తుకొని ఏడ్వసాగింది.

ఆనంద్ యాక్సిడెంట్‌లో మరణించేడు అన్న విషయం తెలిసిన ఆస్ట్రేలియాలోని భరత్, ఆనంద్ మరణం వెనుక ఉన్న కుట్రను తెల్సుకునే ప్రయత్నం చేస్తుండగా, అది తెల్సిన బ్రెయిన్ రీసెర్చ్ టీం భరత్‌ను కూడా యాక్సిడెంట్‌కి గురిచేసి చంపివేస్తుంది.



గోపిక తన 5 సంవత్సరాల పాపతో ఇండియా తిరిగి వస్తుంది.

గోపిక ఇల్లు మౌనంగా నిశ్శబ్దంగా ఉంది, గోపిక బాల్యమిత్రుడు వివేక్ అక్కడికి వస్తాడు.

**వివేక్ :** గోపికా, చాలా బాధగా ఉంది, ఇలా జరగటం.

**గోపిక :** వివేక్ ఆయన అలా పోతారని అనుకోలేదు.

**వివేక్ :** ఎలా జరిగింది ?

**గోపిక :** యాక్సిడెంట్ (ఇంతలో గోపిక 5సం॥ల పాప చిట్టి అక్కడికి వస్తుంది.)

**గోపిక :** చిట్టీ, నీకు వివేక్ మావయ్య అని చెబుతానే ఆయనే, ఈయన

**వివేక్ :** ఇలారా చిట్టీ, గోపికా చిట్టీని కాసేపు అలా బయటకు తీసుకు వెళ్ళి ఆడిస్తాను.

వివేక్, చిట్టి పార్కుకి వెళతారు, అక్కడ ఆడుతున్న చిట్టి ఉన్నట్టుండి కళ్ళు తిరిగి పడిపోయి, గిలగిలా కొట్టుకుంటుంది. వివేక్ వెంటనే దగ్గరలోని షాప్ దగ్గరకు వెళ్ళి గ్లూకోజ్ కొని నీళ్ళలో కలిపి చిట్టితో తాగిస్తాడు. ఆసమయంలో వివేక్ ఒక ప్రత్యేకమయిన జ్యు జ్యు జ్యు అనే ధ్వని రావటాన్ని గమనిస్తాడు.

వివేక్ చిట్టిని గోపిక దగ్గరకు తీసుకువెళ్ళి గోపికా చిట్టికి మూర్ఛ, ఫిట్స్ వంటి రోగాలు ఏమైనా ఉన్నాయా అని అడుగుతాడు.

గోపిక అలాంటి రోగాలు చిన్నప్పటి నుండి చిట్టికి లేవు. కాని గత నెల రోజుల నుండి ఇలా జర్గుతుంది.

వివేక్ గోపిక, చిట్టిలకు బాయ్ చెప్పి, చిట్టి గురించి ఆలోచిస్తూ నడుచుకుంటూ వెళ్తుంటాడు. వెనుక నుండి ఒక నల్లకారు వేగంగా వెళ్తూ బురద చిమ్మి పోతుంది. వివేక్ వీళ్ళకు కార్లు ఉంటాయి కాని కళ్ళు ఉండవు అని తిట్టుకుంటూ వెళ్తాడు.

వివేక్ తన స్కూలు నుంచి ఇంటికి వస్తూ పర్సు కొనేందుకు ఒక షాపు దగ్గర ఆగుతాడు. అక్కడ చెట్టు ప్రక్కన నిలబడి ఒక అమ్మాయి చూస్తుంటుంది.

వివేక్: ఎవరీమె ఇంత అందంగా ఉంది అనుకుంటు షాప్‌లోనికి వెళ్ళి పర్సుకొని షాపునుండి బయటకు వచ్చి చూస్తాడు. ఆమె మరలా కనిపించదు.

**వివేక్ :** Some thing is there, there was a mistory, behind this history అనుకొని వివేక్ బైక్ మీద వెళ్తుంటాడు. రోడ్డు ప్రక్కన ఒక పిచ్చి ఆమె ఆడుకుంటూ ఉంటుంది. తన దగ్గర ఉన్న రూపాయి ఆమెకు వేసి, వివేక్ తనలో పిచ్చి వాళ్ళు అంటే రోడ్డుమీద బట్టలు చింపుకొని తిరిగే వాళ్ళుకాదు, మెంటల్ హాస్పటల్‌లో బందింపబడినవారు కాదు. నిజమైన పిచ్చివాళ్ళు పెద్దమనుషుల్లా చెలామణి అవుతూ డబ్బు పిచ్చి, అమ్మాయిల పిచ్చి, అధికారం పిచ్చి పట్టిన వారు, అనుకుంటూ వెళ్తుండగా ప్రక్కనుంచి ఒక కారులో అర్ధనగ్నంగా ఉన్న కొందరు యువతీ యువకులు పోతుంటారు.

అది చూసి వివేక్ ధనవంతులకు, వాళ్ళ పిల్లలకు ఇది మామోలేమో, అర్ధరాత్రి రేవ్ పార్టీలు, పట్టపగలు తప్పతాగి కార్లలో తిరుగుతూ వెదవ వేషాలు వేయటం, వీళ్ళను కాదు వీళ్ళ అమ్మా బాబులను తన్నితే ఈ సన్నాసులకు బుద్ధి వస్తుంది, అనుకుంటుండగా ఆ పక్కనే ఉన్న ట్రాఫిక్ కానిస్టేబుల్ వాళ్ళను అలా చూస్తూనే తనకు ఏమి పట్టనట్లు, సబంధం లేనట్లు ఊరుకొని ఏ అమాయక గడ్డి ట్రాక్టర్ వాడు వస్తాడా,చేయి చాపి ఓ 20/– నొక్కేద్దామా అని రోడ్డు వైపు చూస్తుంటాడు. ఇంతలో సుబ్బు ఎదురై

**సుబ్బు :** హలో వివేక్, ఏమిటి ఆలోచిస్తున్నావ్ ?

**వివేక్ :** ఏమి లేదు సుబ్బు రోడ్డుమీద ఒక ఆమె పిచ్చిదానిలా ఆడుకుంటుంది. మరో వైపు కొందరు ధనికులు విలాసవంతమైన కార్లలో వెర్రిమొర్రి వేషాలు వేస్తూ తిరుగుతున్నారు. ధనం లేక అడుక్కొంటున్న ఆమె పిచ్చిదా ? ధనం మత్తులో స్వార్ధంతో పైశాచిక వేషాలు వేసే వీళ్ళు పిచ్చి వాళ్ళా అని ఆలోచిస్తున్నాను.

**సుబ్బు :** రెండూ కాదు వివేక్, బ్రతకటం, చేతకాని వాడు పిచ్చివాడు, బ్రతకడం నేర్చిన వాడు తెలివైనవాడు.

ఐనా, ఎందుకయ్యా నీ కింత వింత వైరాగ్యం, తల పండిన వాళ్ళే స్వార్ధంతో మూర్కంగా ప్రవర్తిస్తూ తాము పోయేటపుడు ఏదో పట్టుకు పోతామని, పిచ్చి పనులు చేస్తుంటే, వయస్సులో ఉన్న వాడివి నీకెందుకు ఇలాంటి ఆలోచనలు.

**వివేక్ :** అంతేనా

**సుబ్బు :** అంతేగా

**వివేక్ :** సుబ్బు, రేపు మనకి బ్యాంక్ ఎగ్జాం ఉంది, గుర్తుందా?

**సుబ్బు :** నువ్వు, నేను ప్రిపేర్ అవ్వాలా ? రవితేజాది ఏదో సినిమా ఉంది,దానిలో లా ఎ.బి.సి.డి.లు దిద్దేద్దాం.

**వివేక్ :** ఎ.బి.సి.డి.లు నాలుగే దిద్దాలా, ఇంకేమీ దిద్దకూడదా ?

**సుబ్బు :** దిద్దాలి అనుకుంటే నీ కిష్టమైన అమ్మాయి పేరులోని మొదటి అక్షరం దిద్దే.

**వివేక్ :** సరే నేను దిద్దాలంటే చాలా మంది పేర్లు ఉన్నాయి మరేం చేయను.

**సుబ్బు :** ఎగ్జాం హాల్‌లో ఏ అమ్మాయ్ అందంగా కన్పిస్తే ఆ అమ్మాయి పేరు తెల్సుకొని పేరులోని మొదటి అక్షరం దిద్దేసేయ్.

**వివేక్ :** ఎగ్జామ్ హాల్‌లోని ఇన్విజిలేటర్ అందంగా కన్పిస్తే ?

**సుబ్బు :** నీ జోక్స్ చాలు వివేక్

స్నేహితులు ఇద్దరూ నవ్వుకుంటారు.

వివేక్ పక్కగదిలో రఘు నిద్రపోతుంటాడు. జ్యు జ్యు జ్యు అని శబ్దం వినిపిస్తుంది. రఘు నిద్రలో ఉండగానే అతని చేతి వేళ్ళు ముడుచుకొని పోతాయి, కాళ్ళు తిమ్మిరి ఎక్కుతాయి. రఘుకి తల పట్టేసినట్టనిపిస్తుంది. శరీరం చల్లబడి నీరసం వచ్చి మంచం మీద నుండి క్రిందకి పడిపోతాడు. ఆ శబ్దానికి వివేక్‌కి మెళుకువ వచ్చి రఘు గదిలోనికి వెళ్ళి చూస్తాడు. రఘు కిందపడి గిలగిలా కొట్టుకొంటూ ఉంటాడు.

వెంటనే వివేక్ రఘు ముఖం మీద నీళ్ళు చల్లి స్పృహలోనికి వచ్చేలా చేస్తాడు. తర్వాత గ్లూకోజ్ నీళ్ళు తాగిస్తాడు.

## Types of Radiation














**వివేక్ :** రఘు ఇపుడెలా ఉంది.

**రఘు :** ఇపుడు బాగానే ఉంది అన్నయ్య

**వివేక్ :** రఘు ఏమైంది నీకు

**రఘు :** ఏమైందో నాకు తెలియదు, అకస్మాత్తుగా నీరసం వచ్చి కళ్ళు మూసుకుపోయి మత్తులోనికి వెళ్ళిపోయేను.

**వివేక్ :** నీ ఈ స్థితికి ముందు ఏమైనా శబ్దం వినిపించిందా ?

**రఘు :** ఏదో జ్యు జ్యు జ్యు అనే ధ్వని వినిపించీ వినిపించనట్టు నాకు వినిపించింది.

**వివేక్ :** సరే రఘు వెళ్ళి ప్రశాంతంగా నిద్రపో

వివేక్ తన గదిలోనికి వెళ్ళి బెడ్‌పై పడుకొని ఆలోచిస్తు ఉంటాడు. మొన్న చిట్టిని పార్కుకి తీసుకు వెళ్ళినపుడు జ్యు జ్యు జ్యు అనే ధ్వని వినిపించింది, ఆ సమయంలో చిట్టి కళ్ళు తిరిగి పడిపోయింది. మళ్ళీ ఈ రోజుకూడా అదే శబ్దం వినిపించడం రఘు కళ్ళు తిరిగి పడిపోవడం ఏమిటి ? ఈ జ్యు జ్యు అనే శబ్దానికి, ఈ సంఘటనలకి మద్య ఏదో సంబందం ఉంది, అనుకొని తన గదికి నిద్రపోవడానికి వెళ్ళిపోతాడు. వివేక్‌కి నిద్రరాక మంచి నీళ్ళు తాగుదామని కిచెన్‌లోకి వెళ్ళతాడు. కిచెన్‌లో వాటర్ ఫిల్టర్ నుంచి నీళ్ళు తాగుతూ పక్కనున్న మైక్రోఓవెన్‌ని చూస్తాడు. వివేక్ తన గదిలోకి వచ్చి పడుకొని ఆలోచిస్తుంటే మైక్రోవేవ్ ఓవెన్‌లో చికెన్ రోస్ట్ అవ్వటానికి కంటికి కనపడని కొన్ని మైక్రోవేవ్స్ కారణం అవుతాయి. ఆ వేవ్స్ కారణంగా చికెన్ ఉడుకుతుంది. అలాగే చిట్టి, రఘులు కళ్ళు తిరిగి, శరీరం మెలికలు తిరిగి పడిపోయే సందర్భంలో ఏవో శబ్దతరంగాలు ఒక ప్రత్యేక ఫ్రీక్వెన్సీలో వీళ్ళపై ప్రయోగిస్తున్నారు అన్నమాట తెల్లారేక రఘుతో ఇంకొన్ని విషయాలు మాట్లాడాలి అనుకుంటాడు. ఉదయం నిద్ర లేచాకా వివేక్ రఘుతో

**వివేక్ :** రఘు నిన్నరాత్రి నీకు నీరసం వచ్చింది కదా, ఇలా ఎప్పటి నుండి జర్గుతుంది.

**రఘు :** ఒక సం॥ నుండి అన్నయ్య

**వివేక్ :** సం॥ నుండి అంటే మొదటి సారి ఎప్పుడు నీకు ఇలా జరిగింది.

**రఘు :** సం॥ క్రితం కాలేజ్ తరుపున ఎక్స్‌కర్షన్‌కి చెన్నై వెళ్ళాను, అక్కడ జ్వరంగా ఉంటే మా ప్రిన్సిపాల్ మేడం హాస్పటల్‌లో చేర్పించారు. ఆ తర్వాత నుండి ఇలా జరుగుతుంది.

**వివేక్ :** మీ ప్రిన్సిపాల్ మేడం నిన్ను ఏ హాస్పటల్‌లో చేర్పించారు.

**రఘు :** జి.ఆర్. హాస్పటల్‌లో చేర్పించారు.

**వివేక్ :** మీ ప్రిన్సిపాల్ మేడం పేరు ?

**రఘు :** మిస్ ఎలీసా

**వివేక్ :** ఆమెది ఏ ఊరు ?

**రఘు :** ఆమె ఎన్.ఆర్.ఐ., గత కొన్ని సం॥గా మా కాలేజ్‌లో ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నారు.

**వివేక్ :** ఆమె క్వాలిఫికేషన్ ఏమిటి ? ఆమె ఏ సబ్జెక్ట్ అయినా చెబుతారా ?

**రఘు :** ఆమె సైకాలజీ క్లాసులు తీసుకుంటారు
**వివేక్ :** సరే కంగారు పడకు నీ సమస్యకు పరిష్కారం వెదుకుదాం.
వివేక్ రఘుని తీసుకొని ఒక డాక్టర్ దగ్గరకు వెళతాడు.
**వివేక్ :** నమస్తే డాక్టర్
**డా॥సంతోష్ :** రండి, కూర్చోండి, చెప్పండి, ఏమైందడి?
**వివేక్ :** డాక్టర్ ఇతడు నా తమ్ముడు రఘు, ఇతని విషయంలో కొన్ని సందేహాలు కల్గి మీ దగ్గరకు వచ్చాం
**డా॥సంతోష్ :** ఆవులిస్తూ, చెప్పండి, మాట్లాడండి.
**రఘు :** డాక్టర్ నాకీమద్యన ఇలా ... ఇలా జరుగుతుంది అని తన సమస్యలు చెబుతాడు.
**డా॥సంతోష :** రఘు నువ్వు బయటకు వెళ్ళు అని చెప్పి, వివేక్‌తో ఇది తలకు సంబందించినది. మీ తమ్ముడిది అంతా భ్రమ, భ్రాంతి, సైకలాజికల్‌గా డిప్రెషన్‌లో ఉన్నాడు. దీనినే ఇల్యుసినేషన్ అంటారు. దీనికి మందులు ఎక్కువడోస్‌లో వాడాలి.
**వివేక్ :** అలాగా డాక్టర్, మా తమ్ముడి సమస్యకి మీరు చెబుతున్న దానికి పొంతనే లేదు, మీ సలహాకి ధన్యవాదాలు.

అక్కడనుండి వివేక్ బయటకి వచ్చి రఘుతో కల్సి ఇంటికి వెళ్ళిపోతాడు. వివేక్ తనలో నేను స్వయంగా అబ్జర్వ్ చేసేను ఒక ప్రత్యేక ధ్వని వినిపిస్తున్న సందర్భంలో మా తమ్ముడు కళ్ళు తిరిగి పడిపోయి బాధపడుతుంటే, డాక్టర్‌కి ఆ విషయం రఘు చెప్పినా వినకుండా వేరే ట్రీట్‌మెంట్ ఇస్తానంటున్నాడు. సమ్ థింగ్ ఈజ్ రాంగ్ అని వివేక్ అనుకుంటాడు.

వివేక్, రఘు ఆ డాక్టరుని కల్సి బయటకు వచ్చాక.
**డా॥సంతోష :** మరొకరికి ఫోన్ చేసి మీరు చెప్పినట్లే వివేక్, రఘులకు చెప్పాను, ఎంతైనా మనం మనం ఒకేటే కదా!
**అవతలి వ్యక్తి :** ట్యాంక్యు డాక్టర్, అసలు నిజం మాత్రం ఆ అన్నదమ్ములకు తెలియనీయకండి, ఏదో తలకు సంబందించిన మానసిక వ్యాధి అని చెప్పి మరోసారి వస్తే మేం చెప్పిన మందులు రాసివ్వండి.
**డా॥సంతోష :** తప్పకుండా, అలాగే చెప్తా.
**వివేక్ :** రఘు నువ్వు ఆ డాక్టర్ మాటలు విని బాదపడకు ప్రశాంతంగా ఉండు, మరో డాక్టర్ దగ్గరకు వెళ్ళి మన సందేహాలు తీర్చుకుందా, నీకు ఏమీ కాదు, నువ్వు ఆరోగ్యంగా ఉన్నావు.

వివేక్ తమ్ముడు రఘుతో కల్సి లండన్ రిటర్న్ అయిన మరో స్పెషలిస్టు డాక్టర్ దగ్గరకు వెళతాడు.
**వివేక్ :** డా॥ కిరణ్ లోపలికి రావచ్చా.?
**డా॥కిరణ్ :** రావచ్చు రావచ్చు, నేను అసలే బిజి డాక్టర్‌ని ఫారిన్ రిటర్న్, త్వరగా చెప్పండి, ఏమిటి మీ సమస్య.

**వివేక్ :** డా॥కిరణ్ మాకు కొన్ని సందేహాలు ఉన్నాయి, అవి తీరుస్తారని మీ దగ్గరకు వచ్చేం.
**డా॥కిరణ్ :** సెప్పండి, సెప్పండి, నేనసలే బిజి డాక్టర్ని, ఫారిన్ రిటర్ని.
వివేక్ రఘు సమస్యలు డాక్టర్‌కి చెప్పి మానవ శరీరంపై ప్రత్యేకించి మస్థిష్కంపై ప్రభావం చూపే కారకాలు ఏమేమి ఉంటాయి అని అడుగుతాడు.
**డా॥కిరణ్ :** ఏమి ఉంటాయి అంటే ఏమి సెప్పగలను, నేను అసలే ఫారిన్ రిటర్ని.
**వివేక్ :** అది సరే నేనడిగిన ప్రశ్నకు మీరు సమాధానం చెప్పలేదు.
**డా॥కిరణ్ :** సాలా కారకాలు ఉంటాయి, నేనసలే ఫారిన్ రిటర్ని.
**వివేక్ :** మీరు ఫారిన్ రిటర్న్ సరే, అసలు ఆ కారకాలు ఏమై ఉంటాయి డాక్టర్
**డా॥కిరణ్ :** మెదడులోని కొన్ని ద్రవాలలో తేడా వల్ల మస్థిష్కం ప్రభావితం అవుతుంది. అంతకు మించి మీరు చెబుతున్న వాటి గురించి నాకు తెలియదు. మీ తమ్ముడిది అంతా భ్రమ, భ్రాంతి, దీనినే షిజోఫ్రినియా అంటారు. మందులు వాడాలి, 5-6 షాక్‌ట్రీట్‌మెంట్లు ఇవ్వాలి.
**వివేక్ :** డాక్టర్, రఘు కళ్ళు తిరిగి పడిపోవడం, రఘుకి తలపోటు రావడం, చేతివేళ్ళు వంకరలు తిరగటం పల్స్ పడిపోవడం భ్రమ, భ్రాంతి ఎలా అవుతుంది. ఇది షిజోఫ్రినియా ఎలా అవుతుంది ?
**డా॥కిరణ్ :** డాక్టర్ మీరా నేనా? మీకే అన్ని తెల్సినపుడు నన్ను అడగటం ఎందుకు ? మీదంతా భ్రమా, భ్రాంతి.
**వివేక్ :** డాక్టర్ నేను మిమ్మల్నో ప్రశ్న అడగవచ్చా ?
**డా॥కిరణ్ :** బాబు నేను బిజి డాక్టర్ని, ఫారిన్ రిటర్ని, మీ ప్రశ్నలకు సమాధానాలు సెప్పలేను.
**వివేక్ :** మీరు డాక్టర్ కదండి?
**డా॥కిరణ్ :** బాబు నీకు పుణ్యం ఉంటుంది. ఇంతకంటే నన్ను ఏమి అడగకు, నా పని మందులు రాయటమే.
**వివేక్ :** డాక్టర్ కిరణ్ మీరు మందులు రాస్తూ ప్రజల నుండి డబ్బులు పిండండి.
వివేక్ రఘులు ఆ హస్పటల్ నుండి బయటకు వచ్చేస్తారు.
**వివేక్ :** రఘు నీ సమస్య ఒకటి చెబితే వాళ్ళు నీకు లేని రోగాలు అంటకడుతున్నారు. కంగారు పడకు ఆ డాక్టర్ని మస్థిష్కంపై పని చేసే బాహ్య కారకాల గూర్చి అడిగితే నీళ్ళు నములుతున్నాడు. ఈ డాక్టర్ చెప్పే ఇల్యూసినేషన్, షిజోఫ్రీనియాల గూర్చి అనేక మెడికల్ జర్నల్స్‌లో ఇదివరకే చదివినవి, ఆ డాక్టర్లు చెబుతున్న వాటికి, నిన్ను బాదిస్తున్న సమస్యలకు అసలు పొంతన లేదు. నీ సమస్యలు చెబితే భ్రమ భ్రాంతి అనటమే నమ్మలేని విషయం.
వివేక్ రఘులు డా॥కిరణ్ హస్పటల్ నుండి బయటకి రాగానే డా॥కిరణ్‌కి ఫోన్ వస్తుంది.
**డా॥కిరణ్ :** హలోసార్ చెప్పండి.
**అవతలి కంఠం :** ఏమి చెప్పారు వివేక్ రఘులకు

**డా॥కిరణ్ :** మీరు చెప్పినట్లే ఇల్యూసినేషన్ అని, షిజోఫ్రినియా అని అబద్దాలు చెప్పాను. కాని వాళ్ళు నమ్మలేదు.

**అవతలి కంఠం :** వాడు దేశం అంతా తిరిగినా ఇలాంటి సమాధానం వస్తుంది. రామలింగా రెడ్డి రీసెర్చ్ టీం అంటే ఏమిటో వాడికి తెలుస్తుంది. మీ సహాయానికి ఎమౌంట్ మీకు ముడుతుంది.

**డా॥కిరణ్ :** మాకు చెప్పాలా సార్, మేమంతా మీ ఫ్రెండ్స్, మీ అనుచరులం.



వివేక్ తన తమ్ముడు రఘుని తీసుకొని తనకు తెల్సిన ప్రోఫెసర్ ఉత్తమ్ దగ్గరకు వెళతాడు.

**వివేక్ :** నమస్తే ప్రోఫెసర్

**ప్రొఫెసర్ ఉత్తమ్ :** హలో వివేక్ చానాళ్ళకు వచ్చేవు.

**వివేక్ :** ప్రోఫెసర్ వీడు మా తమ్ముడు రఘు. రఘు వీరు ప్రోఫెసర్ ఉత్తమ్. భారత రక్షణ పరిశోధనా సంస్థలో పనిచేసి రిటైర్ అయ్యారు. ఒకసారి మా కాలేజి గెస్ట్ లెక్చరర్‌గా వచ్చినపుడు ప్రొఫెసర్ గారితో నాకు పరిచయం కల్గింది. అప్పటి నుండి ఆయనను రెగ్యులర్‌గా కలుస్తుంటాను. వీరు నాకు కావలసిన సలహాలు సూచనలు ఇస్తుంటారు.

**ప్రొఫెసర్ :** రఘు ఏం చేస్తుంటావు ?

**రఘు :** బి.ఎడ్ పూర్తి అయింది. ఎం.ఎస్.సి. చదువుతున్నాను. ప్రోఫెసర్ మీరు ఏ అంశాలపై పరిశోధనలు చేసారు?

**ప్రొఫెసర్ :** నానో టెక్నాలజీ, రోబోటిక్స్ & రిమోట్ సెన్సింగ్ అంశాలపై రిసెర్చ్ చేసాను. వివేక్ ఏంటి ఏమైనా పనిమీద వచ్చావా?

**వివేక్ :** మా తమ్ముడికి ఈ మద్య కొన్ని సమస్యలు కల్గుతున్నాయి, వాటికి పరిష్కారం తెల్పుతారని మీ దగ్గరకు వచ్చేం.

**ప్రొఫెసర్ :** కాబోయే ఉపాధ్యాయుడికి సమస్యలా ? ఏంటా సమస్యలు ?

వివేక్ రఘులు తమ సమస్యలను, తాము అంతకు ముందు కల్సుకున్న డాక్టర్ల గూర్చి వివరాలు చెబుతారు.

**ప్రొఫెసర్ :** రఘు నువ్వు సెల్ ఫోన్ మాట్లాడుతున్నపుడు ఏదైనా డిస్టబెన్స్ వస్తుందా ?

**రఘు :** అప్పుడప్పుడూ కొన్ని మాటలు కల్సిపోతున్నాయి.

**ప్రొఫెసర్ :** నీతో నేరుగా మాట్లాడుతున్నపుడు ఎలా వినిపిస్తున్నాయి.

**రఘు :** ఒకోసారి అర్ధం కాటల్లేదు. సరిగా వినిపించుటలేదు.

**ప్రొఫెసర్ :** ఇంకా చెప్పు ఏమేమి జర్గుతున్నాయో ?

రఘు గత సంవత్సర కాలంగా తను ఫేస్ చేస్తున్న సంఘటనలను ఇలా ఇలా.. .. జరుగుతున్నాయి అని ప్రొఫెసర్‌కి వివరిస్తాడు.

**ప్రొఫెసర్ :** వివేక్ నీకుగాని, మీ కుటుంబానికి గాని శత్రువులు ఎవరైనా ఉన్నారా ?

**వివేక్ :** మాకు శత్రువులు ఎవరూ లేరు ప్రొఫెసర్

**ప్రొఫెసర్ :** నువ్వూ మీ తమ్ముడు చెప్పిన విషయాలను బట్టి నాకు కొంత అర్థం అయ్యింది.
**వివేక్ :** ఏంటి సార్
**ప్రొఫెసర్ :** ఈ ప్రపంచంలో మానవుడు తెలివి పెరిగిన కొద్దీ దానిని తమ స్వార్థానికి వాడుకొంటున్నాడయ్యా
**వివేక్ :** మాకు అర్థం కావడం లేదు సార్
**ప్రొఫెసర్ :** అర్థం అయ్యేలా చెబుతాను

నేను కొన్ని సం॥రాల క్రితం ఉత్తరప్రదేశ్ వెళ్ళినపుడు అక్కడ ఒక శాస్త్రవేత్తను కలిసాను. ఆయన చెప్పిన కథ మళ్ళీ ఇక్కడ రిపీట్ అవుతుంది అనిపిస్తుంది.
**వివేక్ :** ప్రోఫెసర్ మీరేం విన్నారు, ఎంటా కథ?
**ప్రొఫెసర్ :** ఉత్తరప్రదేశ్‌లో ఏడుగురు రహస్య డాక్టర్లు ఒక రీసెర్చ్ చేసారు.
**వివేక్ :** ఎంటా రీసెర్చ్ ?
**ప్రొఫెసర్ :** రహస్యంగా బ్రెయిన్ రీసెర్చ్ చేసి, సాంకేతికంగా ఎవరూ ఊహించని బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థని అభివృద్ధి చేసారు.
**వివేక్ :** ప్రొఫెసర్ బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థ అంటే ఏమిటి ?
**ప్రొఫెసర్ :** బ్రెయిన్ స్కానింగ్ చేసి, బ్రెయిన్ మ్యాపింగ్ ద్వారా బ్రెయిన్‌లో నిక్షిప్తమయిన వివరాలు తెల్సుకుంటారు. ఇది ఫారిన్‌లోని రీసెర్చ్ సెంట్‌ర్‌లలో మెదడు వ్యాధులపై చేసే పరిశోధనలలో చేస్తారు. ఒకప్పుడు ఇది ఎవ్వరికి తెలియని విషయం, ఇక మరొ అంశం దీనిలోనిదే బ్రెయిన్ రీడింగ్ అనగా బ్రెయిన్‌తో కమ్యూనికేషన్ (వైర్‌లెస్ కమ్యూనికేషన్) ఏర్పాటు చేయటం. ఇది కొందరు అనుభవజ్ఞులైన అతికొద్ది విదేశీ డాక్టర్లుకు మాత్రమే తెలిసినది. దీనిద్వారా ఒక వ్యక్తి ఏమి ఆలోచిస్తున్నాడు, ఏం చూస్తున్నాడు అన్నది ప్రతిక్షణం తెల్సుకోవచ్చు.

అలాగే మన మాటలను నేరుగా ఆ వ్యక్తి బ్రెయిన్‌కి చేరవేసి వినిపించవచ్చు. అతని బ్రెయిన్‌లోని ఆలోచనలను మాటలరూపంలో వినవచ్చు. దీని గురించి నీకు ఉదాహరణలతో వివరంగా చెపుతాను.
**వివేక్ :** ఇది నేను ఇంతకు ముందు వినలేదు, ఎలా ఇది సాధ్యం ప్రొఫెసర్.?
**ప్రొఫెసర్ :** నేడు సైన్స్ చాలా అభివృద్ధి చెందింది, కోట్లలో ఒక్కరు కూడా ఊహించలేని ఆధునిక పద్ధతులు, అధునాతన సాంకేతిక వ్యవస్థలు వచ్చాయి. ఈ హ్యూమన్ బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థకూడా అలాంటిదే.
**వివేక్ :** నిజామా ప్రొఫెసర్.
**ప్రొఫెసర్ :** వివేక్ ఇళ్ళలో దోమలను పారదోలడానికి చిన్న ఎలక్ట్రానిక్ మెషిన్స్‌ని వాడతారు తెల్సా, అవి అల్ట్రాసోనిక్ సౌండ్‌ని ఉత్పత్తి చేస్తాయి. ఆధ్వనికి దోమలు ఇరిటేట్ అయ్యి దోమలు పారిపోతాయి. దీని ద్వారా ధ్వని తరంగాలు జీవులపై ప్రభావం చూపుతాయని తెలుస్తుంది కదా!

**వివేక్ :** అవునవును.

**ప్రొఫెసర్ :** వివేక్ ఇంతకు ముందు కళ్ళలో పొరలు ఏర్పడితే ఏం చేసేవారు ?

**వివేక్ :** కళ్ళు ఆపరేషన్ చేసేవారు.

**ప్రొఫెసర్ :** ఇపుడు ఆపరేషన్ చేయకుండా, కళ్ళపై కొన్ని కాంతి కిరణాలను (లేజర్‌లను) పంపి కంటి చూపు మెరుగుపరుస్తున్నారు. అవునా

**వివేక్ :** అవును

**ప్రొఫెసర్ :** ఈ లేజర్ ట్రీట్‌మెంట్ గురించి నిన్న మొన్నటి వరకు ఎవరికీ తెలియదు.

**వివేక్ :** నిజం సార్, ఈ రోజుకి చాలా మందికి లేజర్ ఆపరేషన్ అంటే తెలియదు.

**ప్రొఫెసర్ :** అదే రకంగా డాక్టర్లు కొన్ని శస్త్ర చికిత్సలలో కత్తిరించిన చర్మాన్ని కుట్లు వేయకుండా అతికించే పద్ధతి ఉంది. దీనికి ఒక ద్రావణం వాడతారు.

**వివేక్ :** ఇది నేనెపుడూ వినలేదు ప్రొఫెసర్.

**ప్రొఫెసర్ :** అంటే నీకు తెలియని ఒక కొత్త విషయం చెబితే దానిని కట్టు కథ అంటావా వివేక్. సైన్స్‌లో ఎప్పటికి అప్పుడు కొత్త ట్రెండ్స్ వస్తుంటాయి. అవి సామాన్య ప్రజలకు తెలియాలి అంటే చాలా కాలం పడుతుంది. శాస్త్రవేత్తలు, డాక్టర్లు రీసెర్చ్ చేసి కనుగొన్న కొన్ని విషయాలను రహస్యంగా ఉంచుతారు. సామాన్య ప్రజలకు తెలియనీయరు.

**వివేక్ :** ఎందుకు తెలియనీయరు ?

**ప్రొఫెసర్ :** శాస్త్రవేత్తలు కొన్ని సం॥ పాటు రీసెర్చ్ చేసి కొన్ని వందల ప్రయోగాలు చేసి ఒక కొత్త విషయం కనుగొంటారు. తమకు తెలిసిన విషయం ద్వారా తామే లాభం పొందాలనే స్వార్ధం కొందరిలో ఉంటుంది.

**వివేక్ :** మరి ఈ ప్రయోగాలు ప్రజలు తెల్సుకోలేరా ?

**ప్రొఫెసర్ :** వివేక్ నువ్వొక తాపీ మేస్త్రివైతే నీకు ఇటుక గట్టితనం, సిమెంట్, ఇసుకలు ఏ పాళ్ళలో కలపాలన్నది తెలుస్తుంది. అవునా, వివేక్ నువ్వొక డాక్టరువో, లాయర్వో అయితే ఇటుక గూర్చి, ఇసుక, సిమెంట్‌ల పాళ్ళగూర్చి తెలుస్తుందా?

**వివేక్ :** తెలీదు.

**ప్రొఫెసర్ :** నీకే కాదు, ఈ ఊర్లో సొంతంగా ఇల్లు కట్టుకున్న ఏ ఒకరికీ ఇసుక, సిమెంట్‌ల పాళ్ళ గురించి తెలియదు. ఎవరి వృత్తి గురించి వాళ్ళకి మాత్రమే తెలుస్తుంది. శాస్త్రవేత్తలు, డాక్టర్లు చేసిన పరిశోధనల గూర్చి లాయర్లకి, పోలీసులకి, వ్యాపారస్తులకు, నీలాంటి సామాన్యులకు ఎలా తెలుస్తుందయ్యా.

**వివేక్ :** అవును సార్ కొత్త సాంకేతిక పరిజ్ఞానం రీసెర్చ్‌ల గురించి మాలాంటి సామాన్యులకు తెలియదు.

**ప్రొఫెసర్ :** మన ప్రజలు గొర్రెలు లాంటి వారయ్యా, ఏదైనా ఒక కొత్త విషయం మనం వాళ్ళకి చెబితే అర్ధం చేసుకోరు కదా తిరిగి వాళ్ళు మనల్ని పిచ్చివాళ్ళు అంటారు.

**వివేక్ :** నిజమే సార్, ఈ సందర్భంలో చరిత్రలోని ఒక విషయం నాకు గుర్తుకొస్తుంది.

**ప్రొఫెసర్ :** ఏంటది ?

**వివేక్ :** మీకు తెలియనిది కాదు, కొన్ని వందల సం॥ క్రితం భూమి చుట్టూ సూర్యుడు, ఇతర గ్రహాలు తిరుగుతున్నాయని అప్పటి ప్రజలు నమ్మేవారు. కోపర్నికస్ అనే ఆయన భూమి చుట్టూ సూర్యుడు తిరగడం లేదని, సూర్యుని చట్టూ భూమి తిరుగుతుందనే సత్యాన్ని లోకానికి చెప్పాడు. అప్పటి అమాయక ప్రజలు తమ మత విశ్వాసాలకు అది విరుద్ధమని భావించి కోపర్నికస్‌ను ఊరి మధ్యలో సజీవదహనం చేసారు.

దీనిని బట్టి గొర్రెలలాంటి అమాయక ప్రజలకు వాళ్ళకు తెలియని ఒక కొత్త విషయం చెబితే చెప్పిన వాళ్ళను పిచ్చివాళ్ళుగా భావిస్తారు.

**ప్రొఫెసర్ :** ఇలాంటిదే ఉత్తర ప్రదేశ్‌లో జరిగింది. అక్కడి డాక్టర్ల బృందం తమ రీసెర్చ్‌ని ఆ అమాయక పట్టణ ప్రజలపై ప్రయోగించింది. వివేక్ నువ్వు టెలిపతి గురించి విన్నావా?

**వివేక్ :** హెూమియోపతి, అలోపతి గురించి విన్నాను. కాని ఈ టెలిపతి గూర్చి వినలేదు, టెలిపతి అంటే టెలిఫోన్‌లో మాట్లాడటమాండి?

**ప్రొఫెసర్ :** వివేక్ టెలిపతి అంటే మానశిక వార్తావహనం, మనస్తత్వశాస్త్రంలో ఒక అంశం.

**వివేక్ :** నాకు అర్ధం అయ్యేలా చెప్పండి ప్రొఫెసర్.

**ప్రొఫెసర్ :** చాలా సం॥ క్రితం విదేశాలలో ఒక పరిశోధన జరిగింది దానిలో ఒక తల్లి పావురం – దానికి కొన్ని వందల కిలోమీటర్ల దూరంలో కొన్ని పిల్ల పావురాలను ఉంచారు. ఆ పరిశోధకులు ఒకో పిల్లపావురాన్ని చంపేవారు, అలా పిల్ల పావురం చంపబడిన ప్రతిసారీ తల్లి పావురం మెదడులో కొన్ని సంవేధనలు కల్గేవి.

అంటే 100కీ॥మీ దూరంలో ఉన్న తల్లి పావురానికి ఆ పిల్ల పావురం మరణానికి సంబందించిన సమాచారం చేరవేయబడటం జర్గింది. దీనినే మానశిక వార్తావాహనం అంటారు. ఇది ఇంచుమించు 30 సం॥ క్రితం సోవియట్ యూనియన్ పరిశోధకులు చేసిన ప్రయోగం, ఆ తర్వాత ఆదిశగా అనేక పరిశోధనలు జరిగాయి.

**వివేక్ :** చాలా ఆసక్తికరంగా ఉంది.

**ప్రొఫెసర్ :** ఈ ప్రయోగంలాంటిదే ఉత్తరప్రదేశ్ డాక్టర్ల రిసెర్చ్ టీం చేసింది ఎలక్ట్రానిక్ కమ్యూనికేషన్ వ్యవస్థను మానవ బ్రెయిన్‌కి అనుసంధానించటం.

**వివేక్ :** సార్ మీరేమి అనుకోకపోతే ఒక మాట అడగనా ?

**ప్రొఫెసర్ :** ఏంటి ప్రొఫెసర్ ఇంగ్లీష్ సినిమా కథ చెప్తున్నారు అనుకొంటున్నావా ? వివరంగా చెపుతాను విను, ఏదైనా ఒక పని చేయాలి అంటే ముందు ఏం చేయాలి? ఆలోచించాలి, ఆలోచన ఎక్కడి నుండి పుడుతుంది? మెదడు నుండి, ఈ పరిశోధకులు చేసిన రీసెర్చ్ దీని మీదనే, ఆలోచనలను నేరుగా తెలుసుకోవటం ఎలా ? అని.

**వివేక్ :** మీ మాటలకు అర్ధాలు ఇపుడిపుడే తెలుస్తున్నాయి.

**ప్రొఫెసర్ :** వైద్యశాస్త్రంలో న్యూరాలజీ, న్యూరోసైకాలజీ, పారా సైకాలజీ లాంటి ఎన్నో శాఖలు ఉన్నాయి, కొన్ని మానవ మెదడు, మెదడుకు సంబందించిన వ్యాధులు లాంటి అంశాలతో కూడి సైకాలజీతో కూడా రిలేషన్ కల్గి ఉంటాయి.

ఉత్తరప్రదేశ్‌లోని ఈ శాఖలకు చెందిన డాక్టర్ల రీసెర్చ్ టీం రీసెర్చ్ చేసి "హ్యూమన్ కమ్యూనికేషన్ & రోబోటిక్ రిమోట్ సెన్సింగ్" (మానవ బ్రెయిన్‌తో కమ్యూనికేషన్) అనే వ్యవస్థను అభివృద్ధి చేసారు.

**వివేక్ :** ఇది ఏదో కొత్త విషయంలా ఉందే.

**ప్రొఫెసర్ :** ఏమీ లేదయ్యా ఒకప్పటి నమ్మలేని విషయం కొంత కాలానికి సాదారణ విషయం అవుతుంది.

**వివేక్ :** నిజమే, ఒకపుడు మానవుడు గాలిలో ఎగరటం అసాధ్యం అనిపించేది, తర్వాత విమానాలలో ప్రయాణించటం జర్గింది. తర్వాత రాకెట్ సాయంతో చంద్రుడిపై కాలు పెట్టడం సాధ్యం అయ్యింది. ఇది కొన్ని సం॥ల క్రితం ఆలోచిస్తే నమ్మలేని విషయం.

**ప్రొఫెసర్ :** అవును కదా! అలాంటిదే ఈ రీసెర్చ్ కథ. వివేక్ నువ్వు బ్లాక్ హోల్స్‌పై పరిశోధనలు చేసే స్టీఫెన్ హకింగ్స్ గూరించి విన్నావా ?

**వివేక్ :** పూర్తిగా తెలియదు.

**ప్రొఫెసర్ :** ఆ శాస్త్రవేత్త అంగవైకల్యంతో బాదపడుతుంటే అతని సమస్యలు తీర్చడానికి అతని బ్రెయిన్ నేరుగా కంప్యూటర్‌కి అనుసంధానం అయ్యేలా డాక్టర్లు ఒక కమ్యూనికేషన్ వ్యవస్థను రూపొందించారు.

**వివేక్ :** అవునా, ఇలాంటి కమ్యూనికేషన్ సిస్టం ఉందా ప్రొఫెసర్?

**ప్రొఫెసర్ :** ఈయన గూర్చి నీకు పేపర్లో, మాగ్జైన్స్‌లో, ఇంటర్‌నెట్‌లో విస్తృతంగా సమాచారం దొరుకుతుంది. ఏ న్యూరోసర్జన్ అయినా ఇంకా వివరంగా చెప్పాలంటే మెదడు వ్యాధులకు సంబంధించిన ఏ నిజాయితీ పరుడైన డాక్టర్‌ని అడిగినా తెలుస్తుంది. ఈ ఉదాహరణ ద్వారా నీకు ఇలాంటి కమ్యూనికేషన్ వ్యవస్థ ఉంది అని ఇప్పటికైనా తెల్సిందా.

**వివేక్ :** నాకు ఇప్పుడు నమ్మకం కుదిరింది, ఇలాంటి బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థ ఒకటి ఉంటుందని.

**వివేక్ :** ప్రొఫెసర్ ఎలా వాళ్ళు ఈ టెక్నాలజీని అభివృద్ధి చేసి, హ్యూమన్ కమ్యూనికేషన్ వ్యవస్థను ఏర్పాటు చేసారు.

**ప్రొఫెసర్ :** మీరు ఎప్పుడైనా నేషనల్ జాగ్రఫీ, డిస్కవరీ లాంటి చానల్స్ చూస్తుంటారా?

**వివేక్ :** చూస్తుంటాము.

**ప్రొఫెసర్ :** వాటిలో కొన్ని ప్రొగ్రామ్స్‌లో శాస్త్రవేత్తలు సముద్రాలలో తిరిగే కొన్ని చేపల మీద ప్రయోగాలు చేస్తూ వాటి శరీరానికి కొన్ని సెన్సార్లు అమరుస్తారు. వాటి ద్వారా ఆ చేపలు ఎంత దూరంలో ఉన్నాయి, వాటి పరిసరాలలోని ఉష్ణోగ్రత ఎంత, వాటి జీవ క్రియలు ఏంటి? అనే

అంశాలను తీర ప్రాంతంలోని శాస్త్రవేత్తలు తెల్సుకోవడం జర్గుతుంది.
**వివేక్ :** అవును డిస్కవరీ చానల్‌లో చూసాను.
**ప్రొఫెసర్ :** ఇలాంటిదే మరొకటి, నువ్వు షాపింగ్ మాల్స్‌కి వెళ్తుంటావా ?
**వివేక్ :** వెళ్తుంటాను.
**ప్రొఫెసర్ :** పెద్ద పెద్ద షాపింగ్ మాల్స్‌లో ఎంట్రన్స్‌లోకి వెళ్ళగానే డోర్స్ ఆటోమెటిక్‌గా తెరుచుకోవటం, లోపలికివెళ్ళగానే వాటికి అవే మూసుకు పోవటం జరుగుతుంది. ఇది ఎలా జర్గుతుందో తెల్సా వివేక్.
**వివేక్ :** తెలియదు.
**ప్రొఫెసర్ :** ఇది సెన్సారుల ద్వారా జర్గుతుందయ్యా ! ఈ సెన్సారులలో నానో సెన్సార్లు, బయోసెన్సార్లు, మోషన్ సెన్సార్లు, లేజర్ సెన్సార్లు అని చాలా రకాలున్నాయి. వీటి గూర్చి ఎప్పుడైనా విన్నావా ?
**వివేక్ :** వినలేదు.
**ప్రొఫెసర్ :** వివేక్ నిత్యజీవితంలో ఎన్నో ఇలాంటివి మనకు తెలియకుండా ఉపయోగిస్తాం, ఉదాహరణకి మనం రోజూ చూసే టి.వి.లో చానల్ మార్చటానికి వాడే రిమోట్‌లలో వాడే టెక్నాలజీ, రిమోట్‌తో టి.వి. ఆపరేట్ చేయడం. ఇది రోజు మనం చేస్తుంటాం, కావున సాధారణ విషయం, పట్టించుకోం, ఇది వింత అనిపించదు. కాని ఇందులోని టెక్నాలజీ గురించి మనం అస్సలు తెల్సుకోం, ఎలా సాధ్యం అన్నది. ఇలాంటివే నానో సెన్సార్లు, నేనో టెక్నాలజీ కూడా !
**రఘు :** నానో సెన్సార్లు అంటే ?
**ప్రొఫెసర్ :** తల వెంట్రుకలో 1000 వంతు కంటే తక్కువ మందం గల సెన్సార్లు.
**వివేక్ :** ఈ సెన్సార్లు గురించి, ఈ టెక్నాలజీ గురించి వినలేదు.
**ప్రొఫెసర్ :** ఇలాంటి సెన్సార్లు గురించి, రిమోట్ సెన్సింగ్ గురించి నీకు తెలియాలి అంటే ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్స్, రోబోటిక్స్ రంగంతో పరిచయం ఉన్న వాళ్ళకు మాత్రమే తెలుస్తుంది. సాధారణ ప్రజలకు తెలియదు.

వివేక్, ఎందుకు మీకు ఇవన్నీ చెప్తున్నాను. అంటే ఒక మనిషి ఇల్లు కట్టాలి అంటే ముందు పునాది ఎలా తీయాలి, పిల్లర్స్ ఎలా వేయాలి అనే ప్రాధమిక అంశాలు తెల్సి ఉండాలి, నేరుగా స్లాబ్ వేస్తాను అంటే ఆ వ్యక్తికి ఇల్లు కట్టడం తెలియదు అన్నమాట. నేనిప్పుడు చెప్పబోయే, డాక్టర్లు చేసిన ఈ రీసెర్చ్ నీకు అర్థం కావాలి అంటే నేను చెప్పబోయే అంశాల గురించి నీకు ప్రాధమిక అవగాహన కలగాలి. ఎందుకంటే వాళ్ళ రీసెర్చ్ మానవ బ్రెయిన్‌తో కమ్యూనికేషన్ చేయటం. ఇందులో బ్రెయిన్‌కి సంబందించిన వైద్య పరిజ్ఞానం, ఎలక్ట్రానిక్స్ మరియు కమ్యూనికేషన్ రిమోట్‌సెన్సింగ్, వీటిని రెండింటిని అనుసంధానం చేస్తు కంప్యూటర్ ప్రత్యేక సాఫ్ట్‌వేర్ ఉంటాయి. వీటి గురించి కొంత నీకు తెలిసి ఉండాలి.
**వివేక్ :** అది ఎలా ?

**ప్రొఫెసర్ :** నేను ఇంతకు ముందు వివరించిన అంశాలను ఒకదానికి ఒకటి అనుసంధానించి చూడు, నీకే అలాంటి హ్యూమన్ కమ్యూనికేషన్ వ్యవస్థ ఎలా సాధ్యం అయ్యిందో తెలుస్తుంది. ఈ రీసెర్చ్ ఎలా జరపబడిందో నీకు అర్థం అవుతుంది.

స్టీఫెన్ హాకింగ్స్ – ఖగోళ శాస్త్రవేత్త విషయంలో వాడుతున్న టెక్నాలజి

\+

సముద్ర చేపల జీవక్రియల అధ్యయనంలో వాడుతున్న సెన్సార్ టెక్నాలజీ

\+

సాటిలైట్ కమ్యూనికేషన్ సిస్టం లేదా

(వ్యోమగాములు అంతరిక్షంలో ఇతర గ్రహాలపై వాడే కమ్యూనికేషన్)

\+

రోబోటిక్ రిమోట్ సెన్సింగ్

\+

మెదడుకు సంబందించిన విజ్ఞానం (న్యూరాలజీ పరిజ్ఞానం)

ఈ అంశాలన్నీ ఒకే చోట చేరిస్తే నేను చెప్పిన హ్యూమన్ కమ్యూనికేషన్ వ్యవస్థ సాధ్యం అవుతుంది. వైద్య శాస్త్రంతో సంబందం ఉన్న ఆ ఉత్తరప్రదేశ్ డాక్టర్లు, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు టీం చేసినది ఈ రీసెర్చ్‌నే.

వివేక్: కంప్యూటర్‌ను అనుసంధాన కర్తగా ఉంచి మానవుని బ్రెయిన్‌తో ఎలక్ట్రానిక్ కమ్యూనికేషన్ వ్యవస్థను ఏర్పాటు చేయటం చాలా అద్భుతంగా ఉంది.

**ప్రొఫెసర్ :** వినటానికి ఈ రీసెర్చ్ చేసిన డాక్టర్లు సాధించినది అద్భుతంగానే ఉంటుంది. కాని అదే ఉత్తర ప్రదేశ్ లోని ఒక పట్టణ ప్రజలకు శాపం అయ్యింది.

వివేక్: ఎందుకు అలా జరిగింది.?

**ప్రొఫెసర్ :** ఆ డాక్టర్లటీం తమ రీసెర్చ్‌ని అమాయక ప్రజలపై ఉపయోగించి, దానిని తమ స్వార్థానికి వాడుకున్నారు. ఆ రిసెర్చ్ టీం డాక్టర్లు, వారి నాయకుడు ఆ పట్టణంలో ముందుగా వైద్యం పేరుతో కొన్ని హాస్పిటల్స్‌ని నెలకొల్పారు. అది తమ అనుచర డాక్టర్ల ద్వారా.

వాళ్ళు హాస్పటల్స్‌కి వైద్యం కోసం వచ్చే అమాయక ప్రజలను వారికి తెలియకుండా బ్రెయిన్ స్కానింగ్ చేసి బ్రెయిన్ మ్యాపింగ్ అనే ఆధునిక పక్రియను ఉపయోగించి, బ్రెయిన్ రీడింగ్ చేసేవారు. తర్వాత తాము కనుగొన్న బ్రైన్ కమ్యూనికేషన్ వ్యవస్థను వారికి అమర్చేవారు. అప్పటి నుండి ఆ కమ్యూనికేషన్ వ్యవస్థ అమర్చబడిన వారి ఆలోచనలు, వారు చూసే దృశ్యాలు అన్ని వీరు తెలుసుకొంటూ తిరిగి వారితో కమ్యూనికేషన్ చేసేవారు.

ఆ పట్టణ ప్రజల ఫోన్‌లు, కంప్యూటర్‌లు అన్నీకూడా వాళ్ళు హ్యాక్ చేసేవారు. ఆ ప్రజలను మోసం చేస్తూ ఒక రకంగా సమాంతర ప్రభుత్వాన్ని ప్రజలకు తెలియకుండా నడిపే వారు.

**వివేక్ :** ఆ పట్టణ ప్రజలు అంత అమాయకులా ?

**ప్రొఫెసర్ :** వివేక్ నీకొక సైన్స్ ఎక్స్పరిమెంట్ చెబుతాను. నిజం తెలిస్తే అది సైంటిఫిక్‌గా సాధ్యం అంటావు, తెలియపోతే కనికట్టు లేదా భ్రమ అనుకుంటావు.

ప్రొఫెసర్ తన ఇంటిలోకి వెళ్ళి ఒక నిముషం తర్వాత బయటకి వస్తాడు. వివేక్ నీ బోటన వేలు, చూపుడు వేలు రుద్దు. వివేక్ రుద్దుతాడు.

**ప్రొఫెసర్ :** ఏమయ్యింది.

**వివేక్ :** ఏమీ కాలేదు.

ప్రొఫెసర్ తన చూపుడు వేలు, బొటన వేలు రుద్దుతాడు, రుద్దగానే ఆ వేళ్ళ నుండి పొగలు వస్తాయి.

**వివేక్ :** ఇది ఎలా సాధ్యం? మీ చేతి వేళ్ళనుండి పొగలు వస్తున్నాయి.

**ప్రొఫెసర్ :** డాక్టర్లు, సైంటిస్టులు చేసే సైంటిఫిక్ రిసెర్చ్‌లు కూడా సామాన్య జనాలకు ఇలానే నమ్మలేని విధంగా ఉంటాయి నిజం తెల్సేదాకా, నిజం తెలిస్తే ఇది సైంటిఫిక్‌గా సాధ్యం అని తెలుస్తుంది నీలాంటి జనాలకు. ఇందులో నమ్మలేని విషయం ఏదీ లేదయ్యా, ఇది జస్ట్ చిన్న సైన్సు తమాషా, నేను లోపలికి వెళ్ళినపుడు ఒక రెడ్‌స్టార్ అగ్గిపెట్టె ప్రక్క పేపర్‌ను మండించి, ఏర్పడ్డ నూనె లాంటి ఆవిరిద్రవాన్ని నా రెండు వేళ్ళకు పూసుకొని బయటకి వచ్చి, నీ ముందు నా రెండు వేళ్ళను రుద్దాను. నా చేతి వేళ్ళకు పూసుకున్న పదార్ధంలోని రసాయనాలు రాపిడి వల్ల రసాయన చర్య జరిగి వేళ్ళనుండి పొగలు ఏర్పడ్డాయి. చూసే వారికి ఇది ఏదో అసాధారణ విషయం అనిపిస్తుంది.

*ఒకరికి తెలిస్తే రహస్యం, పది మందికీ తెలిస్తే నిజం.*

నేను చెప్పిన అగ్గిపెట్టె– పొగలు ప్రయోగం రుజువుతో నీకు తెల్సింది కాబట్టి నువ్వు నమ్మగలిగేవు. ఉత్తర ప్రదేశ్‌లో డాక్టర్ల టీం రీసెర్చి గూర్చి తెలియని అమాయక ప్రజలు, ఈ బ్రెయిన్ కమ్యూనికేషన్ బారిన పడి వారికి ఏమి జరిగిందో తెలియని వింత పరిస్థితిలో అయోమయంలోపడి ఆ రిసెర్చిటీం చేతిలో కీలు బొమ్మలుగా ఉండేవారు.

**వివేక్ :** మరి ఆ టౌన్‌లో ఉండే పోలీస్ వ్యవస్థకు ఈ విషయం తెలియదా ?

**ప్రొఫెసర్ :** పోలీస్, ఇంటెలిజన్స్ వ్యవస్థలకు ఈ కమ్యూనికేషన్ సిస్టం గూర్చి తెలియదు, ఒక రకంగా ఫెయిల్యూర్ అయ్యారు.

**వివేక్ :** ప్రజల రక్షణ భాధ్యతలు చేపట్టవలసిన పోలీసులు, ఇంటెలిజన్స్ ఎలా ఫెయిల్యూర్ అయ్యాయి.

**ప్రొఫెసర్ :** కొందరు పోలీస్ ఆఫీసర్లు కూడా అందులో భాగస్వాములే. ఇక్కడే ఆ రీసెర్చ్ టీం చాలా తెలివిగా ప్లాన్ చేసారు. ఒక చిన్న లోకల్ సమస్య సృష్టించి, దానిని తమకు అనుగుణంగా మలచుకున్నారు. తమ బ్రైన్ కమ్యూనికేషన్ వ్యవస్థని ఈ వంకతో ప్రజలపై ప్రయోగించారు.

**వివేక్ :** ప్రొఫెసర్ మరి ఆ ప్రజల పరిస్థితి ఏంటి ? వాళ్ళు అంత అమాయకులా ?

**ప్రొఫెసర్ :** అమాయకులా అని అడుగుతున్నావు, సరే నువ్వు మాస్టార్‌వి కదా $E=mc^2$ దీన్ని గురించి వివరించు
**వివేక్ :** నాకు తెలియదు ప్రొఫెసర్
**ప్రొఫెసర్ :** అదేంటి నువ్వు మాస్టర్‌వి కదా?
**వివేక్ :** నేను సోషల్ మాస్టర్ని, నాకు ఫిజిక్సు గురించి ఎలా తెలుస్తుంది.
**ప్రొఫెసర్ :** పోని ఒక లాయర్‌నో, బిజినెస్ మేన్‌నో $E=mc^2$ సూత్రం గూర్చి అడిగితే చెప్పగలడా? చెప్పలేడు.

ఆరకంగానే ఆ టౌన్‌లోని పోలీసులు, లాయర్లు, ఇతర మేధావులుకు ఈ కమ్యూనికేషన్ వ్యవస్థ గురించి తెలియదు, కారణం వాళ్ళకి పరిచయం లేని, అవగాన లేని అంశం కాబట్టి, దీనిని ఆసరాగా తీసుకొని ఆ ఊరి పెద్దల రూపంలో ఆ డాక్టర్ల రీసెర్చ్ టీం అనేక మోసాలు చేసి ప్రజలను భయపెట్టి, తప్పుదోవ పట్టించి, ఆధారాలు లేకుండా చేసి ప్రజలను భాదించేవారు.

తమ హాస్పటల్‌కి వచ్చిన స్త్రీ, పురుషుల శరీరాలలో ఈ బ్రైన్ కమ్యూనికేషన్ వ్యవస్థను అమర్చి వాళ్ళను బ్లాక్‌మెయిల్ చేసి స్త్రీలను తమ కామ కృత్యాలకు వాడుకునే వారు, పురుషులలో లేనిపోని అపోహలు కల్గించి వారిలో వారు కొట్టుకు చచ్చేలా చేసేవారు, ఈ బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థ ద్వారా ఆ వూరి ప్రజలు తమ ప్రక్క వ్యక్తి తమని పిలిచినట్లు, తమని ఉద్ధేశించి మాట్లాడినట్లు, తమని తిట్టినట్లు భ్రమపడేవారు, అదేవిధంగా ఒకే వ్యక్తిని తాము వేరువేరు ప్రదేశాలలో ఒకే సారి చూసినట్లు బావించేవారు. వారు తమ హ్యాకింగ్ నైపుణ్యం ద్వారా ఆ టౌన్ లోని సెల్‌ఫోన్, కంప్యూటర్‌లు అన్నింటిని హ్యాక్ చేసి, నకిలీ ఈ మెయిల్‌లు, మెసేజ్‌లు పెట్టేవారు. దొంగ ఫోటోలు, రాంగ్ కాల్స్ చేసి ప్రజలను తప్పుదారిన పట్టించేవారు. ఆ నిజం ప్రజలకు తెలియక అవి నిజం అని నమ్మేవారు.
**వివేక్ :** అసలు ఈ దొంగ నాటకం ఎలా ప్లాన్ చేసారు ప్రొఫెసర్?
**ప్రొఫెసర్ :** ఒక వ్యక్తి తనను పోలిన మరో వ్యక్తిని ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఉపయోగించి మోసంచేసి క్రమేణా ఆ పట్టణంపై దానిని ప్రయోగించాడు, ఆ కథను ఆ పాత్రలు రూపంలోనే ఎలా జరిగిందో వివరిస్తాను.

ప్రొఫెసర్ కథ ఇలా చెబుతాడు.

అది ఉత్తరప్రదేశ్‌లోని సంబల్‌పూర్, అది ఒక చిన్న పట్టణం, ఆ గ్రామం ఒకప్పుడు ఎంతో ఆనందంతో, శాంతితో ఉండేది. ప్రజలు అంతా కలిసిమెలిసి జీవిస్తూఉండేవారు. ఆ సిటీని పెన్షనర్స్ పేరడైజ్‌గా చెప్పుకొనేవారు. అలాంటి రోజులలో ఒక రోజు పట్టణంలో దీపావళి పండగ జరుపుకుంటున్నారు.
శాస్త్రి మన ఊరిలో అందమైన అమ్మాయి ఎవరో తెల్సా రాయ్ ?
**రాయ్ :** ఎవరు
**శాస్త్రి :** మహి

**రాయ్ :** మహినా, మహి ఎవరు ?
**శాస్త్రి :** మహి, ధర్మాగారి అమ్మాయి, ఈ రోజు మహీకి రోజ్ ఇచ్చి ప్రపోజ్ చేస్తాను.
**రాయ్ :** ఒప్పుకుంటుందా ?
**శాస్త్రి :** ఒప్పుకోకపోతే వంచేద్దాం
**రాయ్ :** మనం ఎందరిని వంచలేదు.



**శాస్త్రి :** మహి ఈ రోజ్ తీసుకో
**మహి :** ఎన్నిసార్లు చెప్పాలి, నువ్వునా వెంట పడ వద్దని.
**శాస్త్రి :** నేనంటే ఎందుకు నీకిష్టం లేదు.
**మహి :** నాకు మా నాన్నగారు వేరే సంబంధం చూస్తున్నారు.
**శాస్త్రి :** నాకేం తక్కువ
**మహి :** నీలాంటి తిరుగుబోతుల్ని ఏ అమ్మాయి ఇష్టపడదు.
**శాస్త్రి :** నన్ను చేసుకోకపోయినా, ఒకసారి నాతో గడుపు.
**మహి :** షటప్
శాస్త్రి మహి చేయి పట్టుకొంటాడు, మహి లాగిపెట్టి శాస్త్రి చెంపమీద కొడుతుంది.
శాస్త్రి అక్కడనుండి వెళ్ళిపోతాడు.



**శాస్త్రి :** రాయ్, నా గుండె రగిలిపోతుంది.
**రాయ్ :** ఏమయింది శాస్త్రి?
**శాస్త్రి :** మహి నన్ను రిజక్ట్ చేసింది. లాగిపెట్టి చెంపదెబ్బ కొట్టింది.
**రాయ్ :** నిన్ను కొట్టిందా, దానిని వదలకూడదు.
**శాస్త్రి :** మనం ఏం చేద్దాం.
**రాయ్ :** నిన్ను నా ఫ్రెండ్ పర్తిరెడ్డి దగ్గరకు తీసుకు వెళ్తా వాడు ఇలాటి వాటిలో ముదురు.
శాస్త్రి, రాయ్‌లు పర్తిరెడ్డి, అతని ఫ్రెండ్ శెట్టి దగ్గరకు వెళ్తారు.
**పర్తిరెడ్డి :** హాయ్ రాయ్ ఏంటి ఇలా వచ్చావు.
**రాయ్ :** వీడు శాస్త్రి, ఒక అమ్మాయి రిజక్ట్ చేసింది, వీడికి మనం ఏదైనా హెల్ప్ చేయాలి.
**శెట్టి :** మన కన్ను పడ్డ అమ్మాయిని వదలడమా, ఇంతకీ ఎవత్తది?
**శాస్త్రి :** మహి
**పర్తిరెడ్డి :** దాని బ్యాక్‌గ్రౌండ్ ఏంటి ?
**శాస్త్రి :** మెయిన్ రోడ్ దగ్గర శ్రీకాంప్లెక్స్ దగ్గర ఉంటారు. వాళ్ళనాన్న ధర్మా. బిజినెస్‌మేన్, బోటులు వున్నాయి. వాటితో ఫిషింగ్ బిజినెస్.
**శెట్టి :** సరే దానితో మనం ఆడుకుందాం. నేను చెప్పినట్టు చేయి.

మరుసటి రోజు సాయంత్రం మహి ఒంటరిగా నడిచి వెళ్ళుతుంటుంది. పర్తిరెడ్డి, శాస్త్రి, శెట్టీలు కల్సి ఆమెను బలవంతంగా రాయ్ గెస్ట్‌హౌస్‌కి తీసుకువెళ్ళి అక్కడ రాయ్ సహాయంతో రేప్ చేస్తారు.

**శాస్త్రి :** నాతో గడపమంటే గడపనన్నావుగా, ఇపుడు నిన్నెవరు పెళ్ళి చేసుకుంటారో చూస్తాను. నీ అందం చూసుకునే కదా నన్ను చెంప దెబ్బ కొట్టావు, నీ ముఖం ఇంకెవరికి చూపిస్తావో చూపించు అంటూ యాసిడ్ ఆమె ముఖం మీద పోస్తాడు.

మహి అరుపులు, కేకలతో హస్పటల్‌లో చేరుతుంది. హాస్పటల్‌లో బెడ్‌మీద కాలిన గాయలతో మహి ఉంటుంది. అక్కడికి ధర్మా వస్తాడు.

**ధర్మా :** ఏమైంది, నా కూతురికి ఏమైంది, ఈ పని ఎవరు చేసారు?

ధర్మా తమ్ముడు వీరాస్వామి: అన్నయ్య మన మహిని ఎవరో రేప్‌చేసి ఏసిడ్ పోసారు.

**ధర్మా :** నా కూతురికి అన్యాయం చేసిన వారిని బ్రతకనివ్వను.

**వీరాస్వామి :** మహి సృహలోనికి రాగానే ఎవరు ఈ పని చేసారో తెల్సుకొని, వాళ్ళ పని పడద్దాం.

మహి సృహలోనికి వస్తుంది.

**ధర్మా :** ఎవరు తల్లి, నీమీద యాసిడ్ దాడి చేసింది.

**మహి :** ఏడుస్తూ, ఒకడు గత కొన్ని రోజులుగా నావెంట పడుతున్నాడు. నేను కాదంటే మరో ముగ్గురితో కల్సి నన్ను రేప్ చేసి, నాపై యాసిడ్ పోసాడు.

**ధర్మా తమ్ముడు :** వాళ్ళు ఎక్కడ ఉంటారో తెల్సా ?

**మహి :** కంప్యూటర్ క్లాసుకి వెళ్ళేటపుడు నా వెంట పడేవాడు. మిగతా ముగ్గురు వాడి ఫ్రెండ్స్ అనుకుంటా.

**ధర్మా :** వాళ్ళను చూస్తే నువ్వు గుర్తు పడతావా ?

**మహి :** గుర్తు పడతాను.

ధర్మా తమ్ముడు వీరాస్వామి తన స్నేహితుల సహాయంతో ఆ కుర్రాళ్ళ వివరాలు తెల్సుకోటానికి ప్రయత్నిస్తుంటాడు. స్వామి మహిని కారులో కూర్చోబెట్టుకొని మహి వెంటపడిన కుర్రాళ్ళ కోసం ఊరంతా తిప్పి చూపిస్తుంటాడు. ఒకరోజు

**మహి :** చిన్నాన కారు ఆపు

**వీరాస్వామి :** ఏమైంది?

**మహి :** ఆరోజు నాపై దాడి చేసిన వాడిలా ఉన్నాడు.

**వీరాస్వామి :** ఏడి వాడు.

**మహి :** అదిగో ఆ బొప్పాయి ముక్కలు అమ్మేచోట నిలబడి తింటున్నాడే, వాడే.

**వీరాస్వామి :** తన కళ్ళతో ఫ్రెండ్స్‌కు సైగ చేస్తాడు.

వాళ్ళు కారు దిగి ఆ అబ్బాయిని ఫాలో అవుతారు. దూరం నుంచి అతని ఇల్లు చూసి

వివరాలు కనుగొంటారు.



**సత్యం :** నాన్న నేను కేంప్ మీద పక్క ఊరు వెళ్తున్నా రాత్రికి కాని రాను.

**పుల్లయ్య :** కేంప్‌లు పేరు చెప్పి, పక్క ఊళ్ళకు వెళ్ళకు.

**సత్యం :** అలా ఎలా కుదురుద్ది నాన్న, మార్కెటింగ్ జాబ్ అంటే తిరగాల్సిందే.

**పుల్లయ్య :** నువ్వొక సన్నాసివి కాబట్టి ఇలా మాట్లాడుతున్నావు, అసలా ఉద్యోగమే వద్దన్నాను.

**సత్యం :** మనస్సులో (ప్రొద్దున్నే ఈయనతో తిట్టించుకోవడం ఎందుకు, మౌనంగా వెళ్ళిపోవటం ఉత్తమం)

ఇంతలో ధర్మా, అతని అనుచరులు పుల్లయ్య ఇంటికి కత్తులతో వస్తారు.

**పుల్లయ్య :** ఎవరండీ మీరు, ఎవరు కావాలి?

**ధర్మా :** ఎవరో తర్వాత చెబుతా, నీ కొడుకుని బయటకి పిలు.

**పుల్లయ్య :** నా కొడుకుతో పనేంటి?

**ధర్మా :** నీ కొడుకు నా కూతురుని తన ఫ్రెండ్స్‌తో రేప్ చేసి, యాసిడ్ పోసాడు.

**పుల్లయ్య :** నా కొడుకు అలాంటి వాడు కాదు.

**వీరాస్వామి :** ఎలాంటి వాడో మక్కిలిరగదన్నితే తెలుస్తాది. వాడిని బయటకి పిలు.

**పుల్లయ్య :** వాడు లేడు.

ధర్మా అనుచరులు పుల్లయ్య ఇల్లంతా వెతికి సామానంతా చిందర వందర చేస్తారు.

**పుల్లయ్య :** నా కొడుక్కి ఇలాంటి గొడవలతో సంబంధం లేదు.

**వీరాసామి :** పెద్దలలో పెడితే తెలుస్తుంది.

**ధర్మా :** ఇంకా పెద్దలు ఏంటిరా, వీళ్ళను తన్ని తగలేయ్యి

ధర్మా అనుచరులు పుల్లయ్యని, పుల్లయ్య భార్య పుల్లమ్మని చితకబాది, రేపు వస్తాం నీ కొడుకు, వాడి ఫ్రెండ్స్ కోసం అని చెప్పి వెళ్ళి పోతారు.

**పుల్లయ్య :** ఇదేం ఖర్మ పుల్లమ్మ. వీడు చిన్నప్పటి నుండి ఇంతే, వట్టి అయోగ్యుడు. ఆ అమ్మాయి ఎవరో తెలీదు, వీడేం చేసాడో, ఇంటిమీదకి తెచ్చాడు. ఈ మధ్య రాత్రి ఆలస్యంగా కూడా ఇంటికి వస్తున్నాడు.

**పుల్లయ్య :** ఏ రోజు పుట్టి పెరిగాకా ఎవ్వరితోను కొట్టించుకోలేదు. వీడి కారణంగా నా బ్రతుకు ఇలా తయారైంది.

**పుల్లయ్య :** నేను పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి కంప్లెయింట్ ఇచ్చి వస్తాను.

పుల్లయ్య పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి కంప్లైంట్ ఇవ్వబోతాడు, అయితే పోలీసులు కేస్ బుక్ చేయకుండా ఇలాంటివి మీరు మీరు సెటిల్‌మెంట్ చేసుకోండి మేం చేయగల్గింది ఏమీ లేదు అని చేతులు దులిపేసుకుంటారు.

వీరాస్వామి మహిని తీసుకొని హస్పిటల్‌కి వెళ్ళి చూపించి తిరిగి వస్తుంటాడు. అంతలో

సత్యం టీ కొట్టు ప్రక్క నుంచొని టీ తాగుతుంటాడు. మహి కారులోంచి చూసి.

**మహి :** చిన్నాన్న అదిగో నిన్న చూసిన వాడు అక్కడ నిలబడి టీ తాగుతున్నాడు.

**వీరాసామి :** పొద్దున్న వీడికోసం ఇంటికి వెళ్ళాం, వీడు లేడు అంటాడు.

అదే సమయంలో రోడ్డుకి అవతలి వైపు ఒక ఫాస్ట్‌ఫుడ్ సెంటర్ దగ్గర నిలబడి పర్తిరెడ్డి న్యూడిల్స్ తింటుంటాడు.

**వీరాసామి :** మహి అటు చూడు.

**మహి :** అరే ఎదురుగా వీడిని పోలిన మరొక్కడు. ఆరోజు నేను చూసింది వీడినా? వాడినా ?

**వీరాసామి :** జాగ్రత్తగా గుర్తుపట్టు మహి, ఇద్దరిలో నీపై దాడి చేసింది ఎవరు ?

**మహి :** అర్థం కావటల్లేదు, ఇద్దరూ అన్న దమ్ములేమో!

**వీరాసామి :** నిన్న నేను ఎంక్వయిరీ చేయించాను, పుల్లయ్యకి ఇద్దరు కొడుకులు, ఒకడు తెలుపు ఒకడు నలుపు అసలు పోలికలు ఉండవు. వీడు ఇంకెవరో ?

వీరాస్వామి తన వెనుక ఉన్న అనుచరులతో చెప్పి న్యూడిల్స్ తింటున్న వ్యక్తి వివరాలు కూడా తెల్సుకోమంటాడు.

విరాసామి ఆరా తీయగా న్యూడిల్స్ తిని కారులో వెళ్ళిపోయిన వ్యక్తి సోమిరెడ్డి కొడుకు పర్తిరెడ్డి అని తెలుస్తుంది. ధర్మా, వీరాస్వామి సోమిరెడ్డి దగ్గరకు వెళ్ళి జరిగినది చెప్పి నిలదీస్తారు.

**సోమిరెడ్డి :** (తనలో) వీళ్ళు అమాయకులు కాబట్టి జరిగింది చెప్పి, నా కొడుకులా మరొకడు ఉన్నాడని నిజం చెప్పారు. నాకొడుకుని ఈ నేరం నుండి తప్పించాలి అంటే నేరం నా కొడుకుని పోలిన వాడిపై తోసేయాలి, అనుకొని పైకి

**సోమిరెడ్డి :** ధర్మాగారు మీరు పెద్దమనుషులు, నేను పెద్దమనిషిని, మన పిల్లలు ఇలాంటివి చేస్తారటండి. మీ అమ్మాయి అయినా, మా అమ్మాయి అయినా ఒకటే ఆ పుల్లయ్యని పిలిచి నిలదీద్దాం, తప్పు ఎవరు చేసినా శిక్షించాల్సిందే.

ఆ మాటలకు ధర్మా, వీరాస్వామి శాంతించి పుల్లయ్యను పిలిపించి మాట్లాడుదాం అని వెళ్ళిపోతారు. వాళ్ళు వెళ్ళగానే

**సోమిరెడ్డి :** పర్తిరెడ్డి, పర్తిరెడ్డి లేరా లే

**పర్తిరెడ్డి :** ఏంటి డాడి, నిద్రపోతుంటే

**సోమిరెడ్డి :** రాత్రంతా బార్లలో తప్పతాగి ఆలస్యంగా నిద్రపోతే ఇలాగే ఉంటాది, లే

**పర్తిరెడ్డి :** చెప్పు

**సోమిరెడ్డి :** నువ్వు మీ ఫ్రెండ్స్ మహి అనే అమ్మాయిని నెలరోజుల క్రితం రేప్‌చేసారా ?

**పర్తిరెడ్డి :** ఇలాంటివి ఎన్నో చేసాం, కొత్తగా ఈ రోజు నన్ను అడుగుతావేంటి?

**సోమిరెడ్డి :** ఆ అమ్మాయిపై యాసిడ్ పోసారా ?

**పర్తిరెడ్డి :** గుర్తొచ్చింది, శాస్త్రి మాట వినలేదని యాసిడ్ పోసాడు

**సోమిరెడ్డి :** ఇంకా ఎవరెవరున్నారు ?

**పర్తిరెడ్డి :** నేను, శాస్త్రి, శెట్టి, రాయ్.
**సోమిరెడ్డి :** అర్జంటుగా మిగిలిన మీ ముగ్గురు ఫ్రెండ్స్‌ని కొన్ని రోజులు ఊరు వదిలి వెళ్ళిపోమను.
ఆ అమ్మాయి నిన్ను గుర్తుపట్టిందట, ఆ అమ్మాయి తండ్రి ధర్మా, వాడి అనుచరులు వచ్చి గొడవ పెట్టబోయేరు. నేను తెలివిగా నిన్ను పోలిన మరొకడిని ఇరికించాను. నువ్వు ఏమి ఎరగనట్లు ఉండి. నిన్ననే బెంగుళూరు నుంచి వచ్చినట్లు నకిలీ ఆధారాలు సృష్టించు.
**పర్తిరెడ్డి :** ఎస్ డాడ్.
మహి, వీరాసామి, ధర్మాలు ఇంటికి వచ్చేస్తారు.
**మహి :** చిన్నాన్న ఆ సత్యం, సోమిరెడ్డి కొడుకులలో ఎవరు నాపై దాడి చేసారంటావు ?
**వీరాసామి :** అదే ఆలోచిస్తున్నా
**మహి :** సత్యం గూర్చి మళ్ళి ఎంక్వయిరీ చేయించు, ఆ సోమిరెడ్డి మాటలు ఎందుకో నమ్మబుద్ధి కావటలేదు.
**వీరాసామి :** నాకు కూడా సత్యం మీద అంతగా అనుమానం లేదు, మళ్ళి ఎంక్వైయిరీ చేయిద్దాం.
**మహి :** ఆరోజు నాపై నలుగురు దాడి చేసారు.
**వీరాసామి :** సత్యం ఫ్రెండ్స్ ఎవరూ అలాంటి వారు కాదని మన వాళ్ళు చెబుతున్నారు.
**మహి :** మరి నిజం ఏమిటి ?
**వీరాసామి :** నిజం కనుగొందాం.
వీరాస్వామి ఫ్రెండ్ నాగు, సత్యం పూర్తి వివరాలు, రామిరెడ్డి కొడుకు పర్తిరెడ్డి వివరాలు సేకరిస్తాడు.
**వీరాసామి :** ఏరా ఎంక్వైయిరీ ఎందాకా వచ్చింది.
**నాగు :** వీరాస్వామి సత్యం అమాయకుడు, సోమిరెడ్డి కొడుక్కి అమ్మాయిల పిచ్చి, వాడు, వాడి ఫ్రెండ్స్ అంతా మోసగాళ్ళు అని తెలుస్తుంది.
**వీరాసామి :** మహిపై దాడి జరిగిన రోజు సత్యం, సోమిరెడ్డి కొడుకు పర్తిరెడ్డి ఎక్కడ ఉన్నారు.
**నాగు :** మహిపై దాడి జరిగిన రోజు సత్యం మీటింగ్ పనిమీద వాళ్ళ హెడ్ఆఫీసుకి వెళ్లాడు. ఆరోజు ఊరిలో లేడు. పర్తిరెడ్డి వాళ్ళ ఫ్రెండ్స్ ఊరిలోనే ఉన్నారు. వీరాస్వామి ధర్మాతో విషయం చెబుతాడు. అంతా కలిసి సోమిరెడ్డి ఇంటికి వెళతారు. అక్కడ కొందరు మేత ఆవులు(మేధావులు) ఉంటారు.
**సోమిరెడ్డి :** ఏంటి ధర్మా ఇలా వచ్చేవు.
**ధర్మా :** జరిగిన మోసం తెల్సింది. మీ అబ్బాయి వాడి ఫ్రెండ్స్ నా కూతురుపై దాడి చేసారని తేలింది.
**సోమిరెడ్డి :** ఆధారలేవి, నువ్వేదో తాగేసి వచ్చి మాట్లాడితే ఎలా ?
**వీరాసామి :** ఆరోజు మీ అబ్బాయి, వాళ్ళ ఫ్రెండ్స్ ఊరిలోనే ఉన్నారని చూసిన వాళ్ళు చెబుతున్నారు.
**సోమిరెడ్డి :** అది అంతా అబద్ధమయ్యా

**ధర్మా :** ఏది నిజమో, ఏది అబద్ధమో పోలీస్ కంప్లైంట్ ఇస్తే తెలుస్తుంది.

**పర్తిరెడ్డి :** పోలీస్ కంప్లైంట్ ఇస్తావా, ఇచ్చుకో మేమే నీ కూతురిని రేప్ చేసాం, ఏసిడ్ దాడి చేసాం. ఏం చేస్తావు. నీకూతురి రేప్ బ్లూ ఫిల్మ్ తీసాం. నువ్వు కంప్లైంట్ ఇస్తే నెట్‌లో పెడతాం.

**ధర్మా :** చంపేస్తా నిన్ను

**గోకులం రాజు :** ఆవేశం తగ్గించుకో ధర్మా, నీ కూతురి పరువు పోతుందయ్యా

**సోమిరెడ్డి :** ధర్మా మనమూ, మనమూ ఒక సెటిల్ మెంట్‌కి వద్దాం, మనం పెద్ద మనుషులం, బయట తెలిస్తే రెండు కుటుంబాల పరువు పోతుంది పిల్లలేదో ఆవేశంలో చేసారు. కాబట్టి పుల్లయ్య కొడుకు సత్యం మీదకి ఈ నేరం తోసేద్దాం. గుప్‌చుప్ అయిపోయి మాతో రాజీకి రా.

**గోకులం రాజు :** పెద్దలం చెబుతున్నాం కదా, మీ సమస్యకి పరిష్కారం ఇద్దని, బయట ఎవరకీ తెలియకుండా రాజీ కుదుర్చుకో.

**ధర్మా :** ఎలాగూ సత్యం ఈ పని చేసాడని అన్నాం. ఇప్పుడు సత్యం మీదకి తోసేయటమే నయం. నా కూతురిని ఎవరూ పెళ్ళి చేసుకోరు కాబట్టి సత్యం మీదకి నేరం నెట్టేసి, పుల్లయ్యను ఒప్పిద్దాం వీరాసామి.

**గోకులం రాజు :** అది మనందరికీ మంచిది.

**వీరాసామి :** ఇదేం న్యాయం అన్నయ్య , పెద్దలు అని చెప్పి వాళ్ళ పిల్లలని వెనకేసుకోస్తారా ?

**ధర్మా :** నువ్వు ఊరుకో వీరాసామి.

**ధర్మా :** మహి, ఈ విషయం బయటకు చెప్పకు మనం సోమిరెడ్డిగారు చెప్పినట్లు చేద్దాం.

**పర్తిరెడ్డి :** మహి మేము చెప్పినట్లు చేస్తే నీ జీవితం చక్కబడుతుంది, లేదంటే అల్లరి అవుతుంది.

**మహి :** అలాగే అని తల ఊపుతుంది.

**వీరాసామి :** పళ్ళు కొరుకుతూ అక్కడి నుండి వెళ్ళిపోతాడు.



**రోజా :** హాయ్ డార్లింగ్ ఫోన్ చేయటం లేదేంటి?

**పర్తిరెడ్డి :** మీ అన్నయ్యకు మన విషయం తెల్సిపోతుందేమోనని.

**రోజా :** వాడి బొంద, వాడికా తెలివి తేటలు ఉంటే ఓ ముసలాడికి ఇచ్చి కట్టబెట్టేవాడే కాదు.

**పర్తిరెడ్డి :** సరే ఎక్కడ కల్సుకుందా?

**రోజా :** ఎప్పటిలాగే, ఊరి చివర పార్క్‌లో

**పర్తిరెడ్డి :** అలాగే, సరిగ్గా సాయంత్రం 5గంటలకు కలుద్దాం

రోజా తన బండి మీద పర్తిరెడ్డిని కల్సుకునేందుకు బయలుదేరుతుంది.

**గోకులంరాజు :** రోజా ఎక్కడికి ?

**రోజా :** షాపింగ్‌కి అన్నయ్య

**గోకుంల రాజు :** నిన్నేకదా, షాపింగ్‌కని వెళ్ళావు

**రోజా :** నిన్న నాకు కావలసిన కలర్ లిప్‌స్టిక్ దొరకలేదు. మళ్ళీ ఇవాళ తెచ్చుకుందామని.

**గోకులంరాజు :** పెందలకాడే ఇంటికి వచ్చేయి.
**రోజా :** అలా మా ఫ్రెండ్స్‌ని కల్సి వస్తానన్నయా.
**గోకులం రాజు :** త్వరగా వచ్చేయ్.

రాత్రి 10గం॥ అవుతుంది రోజా ఇంటికి రాదు, గోకులం రాజు ఈ మధ్య రోజా ప్రవర్తన అనుమానంగా ఉంది, రాత్రిళ్ళు ఇంటికి ఆలస్యంగా వస్తుంది అనుకొంటాడు. మరుసటిరోజు రాత్రి 1గం॥కు గోకులం రాజు నిద్రపట్టక తన గదిలోంచి బయటకి వస్తాడు, రోజా సెల్‌ఫోన్‌లో నవ్వుతూ మాట్లాడుతూ ఉంటుంది. గోకులం రాజు ఈ సమయంలో రోజా ఇంతసేపు ఎవరితో మాట్లాడుతుంది. రోజా పై నిఘా ఉంచాలి అనుమానంగా ఉంది.

రోజులు గడుస్తుంటాయి, రోజా అనుమానాస్పద ప్రవర్తన గురించి గోకులంరాజు ఆరాతీస్తుంటాడు. రోజాకి ఎవరో అబ్బాయితో సంబందం ఉన్నట్లు తెలుస్తుంది. ఒక రోజు రోజా పర్తిరెడ్డి నెంబరు డయల్ చేయబోయి, పరాకుగా మరో నెంబరు, రాంగ్ డయల్ చేస్తుంది. లిఫ్ట్ చేయటం జరుగదు.

**రోజా :** పర్తి రెడ్డి తన సెల్ నెంబరు కొత్తది అని ఇచ్చాడు, ఈ నెంబరు డయల్ చేస్తే లిఫ్ట్ చేయటంలేదు, తర్వాత చేస్తాను అనుకొని రోజా బయటకి వెళ్ళిపోతుంది. కాసేపటికి ఒక సెల్ నుంచి మిస్డ్ కాల్ వస్తుంది. గోకులంరాజు ఆ సమయంలో అక్కడే ఉంటాడు.

**గోకులం రాజు :** సెల్ చూస్తాడు, ఏదో నెంబరు నుంచి మిస్డ్‌కాల్, కాల్ చేసి కట్ చేసాడే, ఇంతలో మళ్ళీ అదే నెంబర్ నుంచి మిస్డ్ కాల్.

**గోకులంరాజు :** లిఫ్ట్ చేసి, ఎవరు నువ్వు ?

**అవతలివైపు నుండి :** హలో ఎవరండి అని మగగొంతు.

గోకులం రాజు ఫోన్ చేసి ఎవరని అడుగుతావే, ఎందుకు ఫోన్ చేసావ్, అనగానే ఫోన్ కట్ అవుతుంది.

**గోకులంరాజు :** రోజాకి ఎవరితోనో సంబంధం ఉంది. అది వీడే అనుకుంటా వీడి వివరాలు ఆరాతీయాలి, అనుకొని వెంటనే గోకులం రాజు తన ఫ్రెండ్ ఐ.జి మూర్తికి ఫోన్ చేసి ఆ నెంబరు చెప్పి వివరాలు తెల్సుకోమంటాడు. సాయంత్రం అయ్యేసరికి ఆ ఫోన్ నెంబరు పుల్లయ్య అనే మర్చంట్‌దని, అతనికి సత్యం అనే కొడుకు ఉన్నాడని వివరాలు చెబుతాడు ఐ.జి మూర్తి.

**గోకులంరాజు :** తన అనుచరులను పిలిచి, సత్యం ఎడ్రస్ చెప్పి వాడిని ఫాలో అయ్యి నా చెల్లితో అక్రమ సంబందం పెట్టుకున్నందుకు అంగ విచ్ఛేదన చేయండి అని చెబుతాడు. గోకులం రాజు అనుచరులు సత్యం ఎడ్రస్ తెల్సుకొని అతడు ప్రతిరోజు లైబ్రెరీకి సాయంత్రం వెళ్తాడు అని తెల్సుకుంటారు. లైబ్రెరీకి వెళ్ళి తిరిగి వచ్చే సమయంలో అతని అంగవిచ్చేదన చేయాలి అని ప్లాన్ చేస్తారు. మరుసటి రోజు సాయంత్రం కాపుకాసి ఆదారివెంట వెళ్తున్న మరో వ్యక్తి సత్యం అనుకొని బలవంతంగా అతని అంగవిచ్చేదన చేస్తారు.

**గోకులం రాజు :** ఏరా పని జర్గిందా ?

**అనుచరులు :** మీరు చెప్పినట్లే చేసాం సార్.
**గోకులం రాజు :** ఈ విషయం బయట ఎవ్వరికి తెలియకూడదు.
**అనుచరులు :** అలాగే సార్



యా అల్లా, ఏ క్యాహోగయా, మేరే బచ్చాకో అని అరుస్తూ రహీం గుండెలు కొట్టుకుంటుంటాడు. ఇంతలో నాజర్ అక్కడికి వస్తాడు.
**నాజర్ :** ఏమైంది అబ్బాజాన్
**రహీం :** నీ తమ్ముడు ఉమర్‌కి ఎవరో అంగవిచ్చేదన కావించారు.
**నాజర్ :** ఎవరు వాళ్ళు, వాళ్ళ అంతు తేలుస్తా.
**రహీం :** నీ తమ్ముడి సంసార జీవితం నాశనం చేసిన వారి జీవితం నాశనం కావాలి బేటా.
**నాజర్ :** తప్పకుండా అబ్బా.



**నాజర్ :** అబ్బా
**రహీం :** క్యాబేటా
**నాజర్ :** మన ఉమర్‌కి అంగవిచ్ఛేధన చేసినది ఎవరో తెల్సింది.
**రహీం :** ఎవరు చెప్పారు.
**నాజర్ :** తమ్ముడిపై ఈ అగాయిత్యం చేసినపుడు వాళ్ళు వేసుకొని వచ్చిన కారు నెంబరు చూసాడట, ఆ నెంబరు ఎంక్వైయిరీ చేస్తే అది గోకులం రాజుది అని తేలింది.
**రహీం :** పద మన పెద్దలను తీసుకొని గోకులం రాజుని నిలదీద్దాం.
నాజర్, రహీం, మరికొందరు గోకులం రాజు ఇంటికి వెళ్తారు. గోకులం రాజు వాళ్ళను ఎందుకు వచ్చేరు అని అడుగుతాడు.
**నాజర్ :** రాజుగారు మా తమ్ముడికి అంగవిచ్ఛేద కావించారు ఏం నేరం చేసేడని.
**గోకులంరాజు :** ఏం మాట్లాడుతున్నావు, నీ తమ్ముడికి నాకు ఏంటి సంబంధం?
**నాజర్ :** మీ తమ్ముడికి అంగవిచ్ఛేధన చేసిన వాళ్ళు మీ కారులోనే వచ్చేరని తెల్సింది.
**గోకులంరాజు :** అయితే, అయితే
**నాజర్ :** నిజం చెబుతారా, మీ ఇల్లు తగలెట్టమంటరా .
**గోకులంరాజు :** (నిజం తెల్సింది.అని తనలో అనుకొని) అయితే ఏంటి,నీ తమ్ముడు నా చెల్లికి ఫోన్ చేసి ఏడిపిస్తున్నాడు.
**నాజర్ :** ఫోన్ చేసాడా ఏ నెంబరు అది ?
**గోకులం రాజు :** ×××009 ఈ నెంబరు నుండి మీ తమ్ముడు నా చెల్లి సెల్‌కి ఫోన్ చేయ్యడం నేను చూసాను. ఈ సెల్‌లో నెంబర్ చూడు.
**నాజర్ :** అసలు మా తమ్ముడికి సెల్‌ఫోన్‌లేదు. ఈ నెంబరు మాదికాదు.

**గోకులం రాజు :** అరే ఈ నెంబరు సత్యం అనే పుల్లయ్య కొడుకుది అన్నారు. ఏంపేరు నీపేరు?

**నాజర్ :** నాపేరు నాజర్, నా తండ్రిపేరు రహీం, నా తమ్ముడు ఉమర్ బాషా.

**గోకులం రాజు :** తలగోకుంటూ ఎక్కడో తేడా జర్గినట్టుందే.

**గోకులం రాజు :** మీరు క్షమించాలి, ఒకరు అనుకొని ఇంకొకరికి శిక్ష విధించాం. దయచేసి బయట ఎక్కడా ఈ విషయం చెప్పకండి.

**ఉమర్ :** నా జీవితం నాశనం చేసి బయట ఎక్కడా చెప్పొదంటావా, నీ చెల్లితో ప్రేమాయణం చేసినవాడు ఎవడు.

**రాజు :** పుల్లయ్య కొడుకు సత్యం అనేవాడు. మా పరువు తీయొద్దు, నీకెంత డబ్బుకావాలి అంటే అంత ఇస్తాను.

**నాజర్ :** నీ డబ్బెవరికి కావాలి, నా తమ్ముడి జీవితం నాకు ముఖ్యం

**ఉమర్ :** నాలాగే ఆ సత్యం గాడు కూడా కావాలి.

**గోకులం రాజు :** నాజర్ ఇలారా (పక్కకు తీసుకెళ్తాడు). జరిగిన విషయం పదిమందికీ తెలిస్తే మా పరువుపోతుంది. నేను ఎంక్వేయిరీ చేసి నీకు న్యాయం చేస్తాను. నాకు కొంత గడువు ఇవ్వు, అందాకా ఈ 10 లక్షలు నీ దగ్గర ఉంచు.

**నాజర్ :** డబ్బెవరికి కావాలి, ముష్టిడబ్బు, నేను ఎంత డబ్బు చూడలేదు, పోయిన నా తమ్ముడి జీవితం వస్తుందా, అయినా మా తమ్ముడి హాస్పటల్ ఖర్చులకని తీసుకొంటున్నా అని తీసుకొని తనలో, నా ఎత్తు పారింది, హుస్సేన్‌తో మేం ఆడుతున్న నాటకం ఈ తింగిరి రాజుగారికి తెలియదు. వీడిని ఇంకా పిండాలి..



**సైదులు :** ఏరా హుస్సేన్ మంచి హుషారుగా ఉన్నావు.

**హుస్సేన్ :** మన ప్లాన్ సక్సెస్ అయినందుకు

**సైదులు :** పర్తిరెడ్డితో కలిసి మనం ఆడిన నాటకం ఆ గోకులం రాజుకు తెలియదు.

**హుస్సేన్ :** గోకులంరాజు ఇంటిలో కారుడ్రైవర్‌గా చేరినప్పటి నుండి వాడి చెల్లి రోజా మీద నాకు కన్ను ఉంది, ఇప్పుడు చిక్కబోతుంది.

**సైదులు :** ఎలా

**హుస్సేన్ :** గోకులంరాజు చెల్లెలు, సోమిరెడ్డిగారి అబ్బాయి పర్తిరెడ్డితో తిరుగుతుంది. పర్తిరెడ్డికి రోజా గూర్చి చెప్పింది నేనే. గోకులంరాజు గారికి రోజా మీద అనుమానం కల్గించి, పర్తిరెడ్డి బదులు వేరే వాడితో తిరుగుతున్నట్లు నమ్మించి మేం ఎరేంజ్ చేసిన నాజర్ అనే వాడి తమ్ముడు ఉమర్‌కి అంగవిచ్ఛేధన చేయించాం. నాజర్‌కి డబ్బు పడేస్తే, నేనూ పర్తిరెడ్డి చెప్పినట్లు నాటకం ఆడాడు. ఇప్పుడు దీనిని అడ్డంపెట్టుకొని ఆ గోకులంరాజుని, రోజాని బ్లాక్‌మెయిల్ చేసి మనం అంతా ఆటాడుకుందాం. ఇదంతా మన పర్తిరెడ్డిగారి ప్లాన్.



రహీం, నాజర్, ఉమర్ లను తీసుకొని పుల్లయ్య ఇంటికి వెళ్తాడు.

**రహీం :** ఇక్కడ సత్యం అంటే ఎవరు ?

**పుల్లయ్య :** మా అబ్బాయి.

**ఉమర్ :** వాడిని బయటకు పిలు, నీ కొడుకు వల్ల నా బ్రతుకు నాశనం అయ్యింది.

**పుల్లయ్య :** ఏమైందయ్యా ?

**నాజర్ :** నీ కొడుకు గోకులం రాజు చెల్లితో అక్రమ సంబందం పెట్టుకొంటే, ఆ రాజు మా తమ్ముడి అంగవిచ్ఛేదన చేసాడు.

**పుల్లయ్య :** నా కొడుకుకి ఆ అమ్మాయితో ఎలాంటి సంబందం లేదు.

**నాజర్ :** ఆ విషయం గోకులం రాజు దగ్గర తేల్చుకుందాంరా.

**పుల్లయ్య :** పద అయితే అక్కడే తేల్చుకుందాం

పుల్లయ్య, రహీం, నాజర్ గోకులం రాజుగారి యింటికి వెళతారు.

**నాజర్ :** గోకులం రాజగారు, ఇదిగో పుల్లయ్య, ఇతడి కొడుకేనా మీ చెల్లెలితో సంబంధం పెట్టుకుంది.

**గోకులంరాజు :** పుల్లయ్య నీ కొడుకు సత్యం ఫోన్ నెంబరు ఎంత?

**పుల్లయ్య :** ××× 009

**గోకులంరాజు :** ఈ సెల్ చూడు, నీ కొడుకు నెంబరు. నా చెల్లికి మిస్డ్ కాల్స్ ఇచ్చి మాట్లాడుతున్నాడు.

**పుల్లయ్య :** మా అబ్బాయి ఫోన్ నెంబరా ?

**గోకులం రాజు :** మా అబ్బాయి ఫోన్ నెంబరా అంటావేంటయ్యా నీ కొడుకు ఫోన్ చేసాడని ఆధారం చూపిస్తుంటే

**రహీం :** పుల్లయ్య కొడుకు తప్పుచేస్తే నా కొడుకుకి శిక్ష పడింది. వాడికి నా కొడుకు లాగే సంసార సుఖం పోవాలి.

**పుల్లయ్య :** నా కొడుకు తప్పు చేస్తే మీరే శిక్ష విధించినా ఒప్పుకుంటా

**గోకులం రాజు :** సరే నెలరోజులు నీ కొడుకు మీద నిఘా పెడతా, తప్పు చేసింది సత్యం అని తెలిస్తే వదలను. పులయ్యా ఈ విషయం సత్యానికి తెలియకూడదు.

**పుల్లయ్య :** సరే మీరేది చెబితే అది చేస్తా.

గోకులం రాజు తన స్నేహితుడు ఐ.జి మూర్తి సహాయంతో సత్యం, నాజర్, ఉమర్‌లపై నెల రోజుల నిఘా పెడతాడు.



దేవి ఒక స్కూల్ టీచర్, ఈమె చెల్లి లక్ష్మి, దేవి లక్ష్మిని సత్యానికిచ్చి పెళ్ళి చేద్దామనుకుంటుంది. గోకులం రాజు, సత్యంపై నేరం మోపాడని తెల్సి లక్ష్మి , లక్ష్మి అక్క దేవి, పుల్లయ్యను తీసుకొని గోకులం రాజు ఇంటికి వెళ్తారు. అక్కడ అప్పటికే రహీం, నాజర్, ఉమర్‌లు ఉంటారు.అప్పటికే

పత్తిరెడ్డి పథకం ప్రకారం రోజా, నాజర్‌లు ఏం మాట్లాడలో ముందే ప్రిపేర్ అవుతారు.
**గోకులం రాజు :** పుల్లయ్య ఎవరీ అమ్మాయిలు ?
**పుల్లయ్య :** ఈ అమ్మాయి లక్ష్మి మా అబ్బాయిని ఇష్టపడుతుంది. ఈమె లక్ష్మి అక్క దేవి.
**నాజర్ :** పుల్లయ్యా నీ కొడుకు సత్యానికి ఈ రోజా అమ్మకు ఏ సంబంధం లేదూ, నిజం చెప్పు
**లక్ష్మి అక్క దేవి :** సత్యం ఎవరితోను తప్పుగా ప్రవర్తించడు.
**ఉమర్ :** ప్రవర్తించాడు కాబట్టే నాకీ గతి పట్టింది. వాడి జీవితం నా జీవితంలా కావల్సిందే.
**రహీం :** నా బిడ్డలాగే వాడు కావాలి.
**లక్ష్మి అక్క దేవి :** అసలు సత్యానికి, రోజాకి సంబందం ఏంటయ్యా, నువ్వు దొంగనాటకం ఆడుతున్నావు.
**నాజర్ :** ఉందని నిరూపిస్తే, మేం చెప్పిన దానికి ఒప్పుకొంటావా ?
**దేవి :** ఒప్పుకోంటాను
**నాజర్ :** సత్యం, రోజాతో తప్పుగా ప్రవర్తించాడు అని నిరూపిస్తే, నువ్వు మా ఉమర్‌ని పెళ్ళి చేసుకొంటావా ?
**లక్ష్మి అక్క దేవి :** సరే చేసుకుంటాను.
**నాజర్ :** రోజా అమ్మా నీ సెల్‌ఫోన్, సత్యం నీకు రాసిన ప్రేమలేఖలు చూపించు. వీళ్ళ కళ్ళు తెరిపించు, నిజం కక్కించు.

రోజా లోపలికి వెళ్ళి కొన్ని పేపర్స్ (అంతకు ముందు పర్తిరెడ్డి తనకు రాసినవి) సెల్‌ఫోన్ పట్టుకొస్తుంది. సెల్‌ఫోన్‌లో సత్యం నెంబరు, పేపర్స్ చూపించి, రోజా తన కళ్ళంట రెండు బకెట్ల నీళ్ళు కార్చుకొని, మర్యాదగల వంశంలో పుట్టిన నాకు ఈ లేఖలు ఏంటి, ఇలా ఫోన్ చేసి ఏడిపించటం ఏంటి, అద్దంలో కూడా పరాయి పురుషుడి ముఖం చూడనే, పుల్లయ్య అంకుల్ మీరే చెప్పండి, నాకు న్యాయం చేయండి అని రాగాలు తీస్తుంది. పుల్లయ్య, లక్ష్మి,, దేవీలు అవి చూసి అవాక్కవుతారు.

**నాజర్ :** ఇప్పుడేంమటారు తప్పెవరిది. సత్యం గాడిని రాజుగారు కాదు నేనే చంపేస్తాను.
**లక్ష్మిఅక్కదేవి :** (ఆకపట నాటకం తెల్సుకోలేక) సత్యాన్ని నువ్వేమి చేయకు, నువ్వేం చెబితే అది చేస్తా.
**నాజర్ :** అయితే నువ్వు మా ఉమర్‌ని పెళ్ళి చేసుకో, వాడికి జరిగిన అన్యాయానికి ఇది న్యాయం అవుతుంది.
**దేవి :** సరే నేను మీ ఉమర్‌ని పెళ్ళి చేసుకుంటాను.
**నాజర్ :** అంతేకాదు, మా ఉమర్ సంసారానికి ఎలాగూ పనికిరాడు. కాబట్టి మేం అయిదుగురు అన్నదమ్ములం, మా అందరితో నువ్వు సంసారం చేయాలి.
**లక్ష్మి :** ఇదేం న్యాయం?
**నాజర్ :** కాదంటే చెప్పు ఆ సత్యాన్ని లేపేస్తాం.

దేవి తన చెల్లి లక్ష్మి అయినా సత్యాన్ని చేసుకొని సుఖపడుతుందని భావించి, అతి జగుప్సాకరమయిన ఈ ఒప్పందానికి ఒప్పుకుంటుంది.

పెద్దమనిషిగా అక్కడ ఉన్న గోకులం రాజు, తన నేరం రుజువు కాకుండా, తన పరువు పోకుండా కాపాడుకోగలిగేను అని ఊపిరి పీల్చుకుంటాడు. రహీం, పుల్లయ్యలను ఈ నిజం సత్యానికి గాని, ఊరి ప్రజలకు గాని చెప్పరాదని చెబుతాడు.

పుల్లయ్య తనకి రోజా సత్యం ప్రేమలేఖలు రాసినట్లు ఏవో పత్రాలు చూపిస్తే, అవి నిజమా, కాదా అని సత్యాన్ని ఒకసారి అడగాలి అనే విచక్షణ జ్ఞానం లేకుండా అవి నమ్మి పరోక్షంగా దేవి జీవితం నాశనం అవటానికి కారణం అవుతాడు. ఆ రకంగా నాజర్, రోజాలు, గోకులం రాజు, పర్తిరెడ్డి పథకం ప్రకారం పుల్లయ్య, దేవీలను మోసం చేస్తారు.
సత్యం సెల్‌కి మిస్డ్ కాల్ వస్తే కాల్ ఎవరిదో తెలుసుకునేందుకు తిరిగి సత్యం కాల్ చేసినట్లు తెలుసుకోలేకపోతారు పుల్లయ్య, దేవీలు.



**పర్తిరెడ్డి :** హాయ్ రోజా
**రోజా :** హాయ్ డార్లింగ్
**పర్తిరెడ్డి :** ఏంటి ఈ మధ్య కలవటం మానేసావు.
**రోజా :** మా అన్నయ్య ఇల్లు కదలనీయటం లేదు.
**పర్తిరెడ్డి :** ఏం
**రోజా :** మన మీద అనుమానం వచ్చింది
**పర్తిరెడ్డి :** మన ఇద్దరి సంబంధం తెల్సిపోయి, ఎవరో ఉమర్ అనే వాడి అంగచ్ఛేదన మా అన్నయ్య చేయించాడు.
**పర్తిరెడ్డి :** అలాగా
**రోజా :** అలాగా అంటావేంటి, అక్కడే అసలు గొడవ మొదలైంది.
**పర్తిరెడ్డి :** ఏమయింది ఏంటి ?
**రోజా :** నువ్వనుకొని ఎవరో పుల్లయ్య కొడుకు సత్యం అనే వాడికి అంగవిచ్ఛేధన చేయించమని మా అన్నయ్య చెబితే ఆదారిన పోయే ఉమర్ అనే వాడికి చేయించారట.
**పర్తిరెడ్డి :** సత్యం అనేవాడా, వాడికి బదులు ఉమర్‌కి అంగవిచ్ఛేదన చేయించారా ?
**రోజా :** అవును

పర్తిరెడ్డి తనలో (గోకులం రాజుకు నా మీద అనుమానం వస్తే నా బదులు ఉమర్ అనే వాడికి అంగవిచ్ఛేదన చేయించమని నేనే కదా హుస్సేన్, నాజర్, లకు డబ్బులిచ్చి నాటకం ఆడించింది, ఈ సత్యం ఎవరు ) పైకి, రోజా కొన్ని రోజులు మనం జాగ్రత్తగా ఉండాలి ఈ విషయం ఎవరికీ చెప్పకు.



పర్తిరెడ్డి, అతని మేనమామ శ్రీనివాసరెడ్డి, శెట్టి, రాయ్ కూర్చుని మాట్లాడుకొంటుంటారు.

**పర్తిరెడ్డి :** మమా కొత్తపిట్టలేమైనా పడ్డాయా ?

**శ్రీనివాసరెడ్డి :** లేదు అల్లుడు, ఆ మధ్య శెట్టి నేను వెళ్తుంటే ఒక కత్తి కన్పించింది. మన హుస్సేన్‌ని ఎంక్వేయిరీ చేయమన్నాను.

**హుస్సేన్ :** అంతలో అక్కడికి వస్తాడు.

**శ్రీనివాసరెడ్డి :** హుస్సేన్ వచ్చేవా, తెచ్చేవా మన నైట్ ప్యారెట్.

**హుస్సేన్ :** లేదన్నా, నీకు 24 క్యారట్స్ ప్యారట్స్ తప్పిస్తే, ఆర్డినరీది నచ్చదు. అందుకే ఈ రోజు దేన్ని బుక్ చేయలేదు.

**శ్రీనివాసరెడ్డి :** నీకు మొన్న చూపించిన దాని ఎడ్రస్ దొరికిందా ?

**హుస్సేన్ :** దొరికింది.

**శ్రీనివాసరెడ్డి :** ఎక్కడ వుంటుంది ?

**హుస్సేన్ :** లయన్స్ క్లబ్ ప్రక్క ఇల్లు

**శెట్టి :** అయితే దానిని నా కేమెరాతో షూట్‌చేసి బ్లూ ఫిల్మ్ తీయాల్సిందే.

**పర్తిరెడ్డి :** మనకి బ్లూ ఫిల్ములు తీయటం మామోలేకదా !



శాస్త్రి, శ్రీనివాసరెడ్డి, శెట్టి, హుస్సేన్‌లు ఆ ఇంటికి వెళ్ళి తలుపు కొడతారు.

**దేవి తలుపు తీసి :** ఎవరు మీరు ?

**హుస్సేన్ :** నేను హుస్సేన్, వీళ్ళు నా ఫ్రెండ్స్ శ్రీనివాసరెడ్డి, శెట్టి.

**దేవి :** ఎందుకు వచ్చారు.

**హుస్సేన్ :** మీ చెల్లికోసం

**దేవి :** ఎందుకు

**హుస్సేన్ :** మాకు నీ చెల్లినచ్చింది. ఒక రాత్రికి కావాలి ఎంత అయినా ఇస్తాం

**దేవి :** ఇది సాని కొంప కాదు

ఇంతలో దేవి చెల్లి లక్ష్మి అక్కడికి వస్తుంది.

**లక్ష్మి :** ఏంటి అక్కా

**దేవి :** వీళ్ళు ఏవో పేలుతున్నారు.

**లక్ష్మి :** ఏమంటున్నారు.

**హుస్సేన్ :** నువ్వు మాకు నచ్చేవు, ఒకరోజు మాతో నిన్ను పంపమంటున్నాము.

**లక్ష్మి :** నేను వేరే అబ్బాయిని ఇష్టపడుతున్నాను, అతనిని పెళ్ళి చేసుకోవాలి అనుకుంటున్నాను.

**శ్రీనివాసరెడ్డి :** ఎవడాడు ?

**దేవి :** మాకు తెలిసిన వాళ్ళబ్బాయి. పేరు సత్యం.

**హుస్సేన్ :** అయితే మీ చెల్లిని పెళ్ళికి ముందు మాతో ఒక రాత్రి గడపమను.

**లక్ష్మి :** పళ్ళు రాలతాయి

ఈ గొడవ విని పక్క యింటిలో ఉండే కబీర్, వల్లీలు అక్కడికి వస్తారు.

**కబీర్ :** ఏంటి చెల్లాయ్, ఎంటి గొడవ

**దేవి :** వీడెవడో లక్ష్మిని అల్లరి చేస్తున్నాడు.

**కబీర్ :** ఏంటయ్యా, ఎవరు మీరు

**హుస్సేన్ :** ఇది మాకు నచ్చింది. ఒక నైట్ మాతో దీన్ని గడపమంటున్నాము.

**కబీర్ :** అరే పెళ్ళికావలసిన అమ్మాయిని, ఇలా అల్లరి చేయరాదు.

**శ్రీనివాసరెడ్డి :** ఏదో నీ చెల్లిని అడుగుతున్నట్లు ఫీలవుతున్నావేం

**వల్లీ :** నన్ను అడిగితే చెప్పు తీసుకొని కొడతా.

**శ్రీనివాసరెడ్డి :** నువ్వూ బాగానే ఉన్నావు, నైట్‌కి ఎంత తీసుకుంటావు.

**కబీర్ :** ఏం కూసావ్ బే, అని శ్రీనివాసరెడ్డి చెంప పగలగొడతాడు.

**హుస్సేన్ :** ఏరా, మా రెడ్డన్ననే కొడతావా ?

**శెట్టి :** రారా హుస్సేన్ వీడి సంగతి తర్వాత చూద్దాం.

**హుస్సేన్ :** అన్నా మనం ఏదో ఒకటి చేయాలి.

**శ్రీనివాసరెడ్డి :** ఏముంది అయితే ఆకు, కాదంటే కరివేపాకు,

**శాస్త్రి :** అర్ధం అయ్యింది.



లక్ష్మి, వల్లీ, కబీర్‌లు రైతు బజారుకు వెళ్ళి తిరిగి వస్తుంటారు. ఇంతలో ఎర్రకారులో హుస్సేన్, శ్రీనివాసరెడ్డి, శెట్టి, శాస్త్రి వచ్చి కబీరు తలపై కొట్టి, లక్ష్మి,, వల్లీలను కారులో ఎక్కించబోతారు. లక్ష్మి వాళ్ళకు చిక్కకుండా తప్పించుకుంటుంది. వల్లీని వాళ్ళు కిడ్నాప్ చేసి కర్నూల్ ఫామ్‌హౌస్‌కు తీసుకుపోతారు. ఇంటికి వచ్చిన లక్ష్మి , వాళ్ళ అక్క దేవి, కబీర్, వల్లీల తండ్రి షరీఫ్‌లకు జరిగినది చెబుతుంది.

**షరీఫ్ :** నా కొడుకు కబీర్‌ను కొట్టి పడేసి, వల్లీని తీసుకుపోయారా ?

**లక్ష్మి :** అవును చాచా

**షరీఫ్ :** ఎవరు వాళ్ళు.

**లక్ష్మి :** ఎవరో శ్రీనివాసరెడ్డి, హుస్సేన్, శాస్త్రి, శెట్టిలట. ఆమధ్య ఇంటికి వచ్చి గొడవ చేసారు. వాళ్ళే ఈ పని చేసారు.

**షరీఫ్ :** ముందు కబీర్ దగ్గరకు వెళ్దాం.

షరీఫ్, లక్ష్మి, దేవీలు వెళ్ళేసరికి కబీర్ మరణించి ఉంటాడు.

**షరీఫ్ :** ఖుదా మనకు అన్యాయం చేసాడు బేటి.

**దేవి :** భగవంతుడు నీకు అన్యాయం చేయలేదు. ఆ శ్రీనివాసరెడ్డి, హుస్సేన్,శాస్త్రి శెట్టిలే ఇదంతా చేసారు.

**లక్ష్మి :** ముందు మన వల్లి ఎక్కడ ఉందో వెతికి పట్టుకోవాలి అంటుంది. అంతలో శ్రీనివాసరెడ్డి, శెట్టి, హుస్సేన్ అక్కడికి వస్తారు.

**లక్ష్మి :** వీళ్ళే మన వల్లీని ఎత్తుకు పోయింది.

**శ్రీనివాసరెడ్డి :** ఇప్పటికి అయినా తెల్సిందా? మేం చెప్పిన దానికి ఒప్పుకోకపోతే ఏమౌతుందో ?

**దేవి :** మా చెల్లి సత్యాన్ని ప్రేమిస్తుంది అంటే, ఇలా మాట్లాడతావేం ?

**శ్రీనివాసరెడ్డి :** ఇది ప్రేమించిన సత్యం మాకంటే దేనిలో ఎక్కువ.

**దేవి :** మీలా అతడు రౌడీ కాదు, బుద్ధిమంతుడు.

**హుస్సేన్ :** సత్యం మీ చెల్లిని ప్రేమిస్తున్నాడా?

**దేవి :** ప్రేమిస్తున్నాడు, అతడు ప్రేమిస్తాడు, అయితే ఏంటట, అతడిని మా చెల్లి పెళ్ళి చేసుకోవాలనుకుంటుంది.

**శ్రీనివాసరెడ్డి :** వాడు మీ చెల్లిని ఇష్టపడకపోతే, వేరే అమ్మాయిని ఇష్టపడితే.

**లక్ష్మి :** అలా జరగదు

**హుస్సేన్ :** అలా జరిగితే ఏం చేస్తావు?

**లక్ష్మి :** మీరేం చెబితే అది చేస్తా.

**హుస్సేన్ :** పందెం, నువ్వు ఓడిపోతే మేం ఏది చెబితే, అది చేయాలి, మేం ఓడిపోతే గుండు కొట్టించుకొని ఊరు వదిలి వెళ్ళిపోతాం. ఈ విషయం, మన మధ్య ఉన్న ఈ పందెం, సత్యానికి కాని, ఊర్లో జనానికి గాని తెలియకూడదు.

**లక్ష్మి :** ఆవేశంగా సరే అని ఒప్పుకొంటుంది.



శ్రీనివాసరెడ్డి, హుస్సేన్, శెట్టి, రాయ్ బార్‌కు వెళ్తారు. అప్పటికే అక్కడ పర్తిరెడ్డి కూర్చుని ఉంటాడు.

**పర్తిరెడ్డి :** ఏంటి మామా ఫుల్ జోష్‌గా ఉన్నావు.

**శ్రీనివాసరెడ్డి :** ఈ వాళ్ళ మన హుస్సేన్, శాస్త్రీ, శెట్టి, నేను ఒక పందెం కాసేం

**పర్తిరెడ్డి :** ఏంటది ?

**శ్రీనివాసరెడ్డి :** లక్ష్మి, దాని అక్క దేవి అని ఇద్దరు అక్కాచెల్లెళ్ళు, లక్ష్మి ఎవరో సత్యాన్ని ప్రేమిస్తుందట, ఆ సత్యం దానిని కాక వేరే అమ్మాయిని ఇష్టపడితే మనం చెప్పినట్టు వింటుందట, లేకపోతే మనం గుండు కొట్టించుకొని,

ఊరొదలి వెళ్ళాలి, అది పందెం.

**పర్తిరెడ్డి :** లక్ష్మి ప్రేమించిన వాడి పేరు ఏమిటి అన్నావు?

**శ్రీనివాసరెడ్డి :** సత్యం

**పర్తిరెడ్డి :** పందెంలో మనం వాళ్ళను సులభంగా మోసం చేసి గెలవవచ్చు.

**హుస్సేన్ :** ఎలా, వాళ్ళు నీకు ముందే తెల్సా ?

**పర్తిరెడ్డి :** గోకులం రాజు చెల్లెలు రోజా విషయంలో నేను అనుకొని, గోకులం రాజు ఆ సత్యానికి అంగవిచ్ఛేదన చేయబోయి, వేరే ఉమర్ అనే వాడికి చేసాడు. ఇప్పుడు గోకులం రాజు అనుమానం ఆ సత్యం మీద ఉంది. మీ పందెం కథలో రోజాతో నాటకం ఆడించి సత్యాన్ని ఇరికించి, పందెం సులువుగా గెలుద్దాం.

ఈ రోజు ఇంకొకటి కూడా జరిగింది. మహి అనే దాన్ని నెలరోజుల క్రితం రేప్ చేసి, బ్లూ ఫిల్మ్ తీసి, ఏసిడ్ ముఖం మీద పోసాం కదా, అది నన్ను చూసి గుర్తించిందట. వాళ్ళ నాన్న ధర్మా మా ఇంటికి వస్తే మా నాన్న నన్ను పోలిన పుల్లయ్య కొడుకు సత్యం మీదకి అది నెట్టి, వివరాలు తెల్సుకుంటాను అని చెప్పి తర్వాత రమ్మన్నాడు. అచ్చం నన్ను పోలిన సత్యాన్ని మన రెండు గొడవలలో ఇరికించి లక్ష్మితో మీరు కాసిన పందెంలో దొంగ నాటకం ఆడి గెలుద్దాం.



మహి, ధర్మా, వీరాస్వామి సోమిరెడ్డి ఇంటికి వెళ్తారు. అక్కడ అప్పటికే సోమిరెడ్డి స్నేహితులు గోకులం రాజు,
రోజా, Dr. RK ఉంటారు.

**సోమిరెడ్డి :** పుల్లయ్యను పిలిచాను. ఆ సత్యానికి విషయం తెలిస్తే నేరం తను చేసినట్టు ఒప్పుకోడు. అందుకే వాడికి తెలియకుండా వాడి తండ్రిని పిలిపించాను. (తనలో ఆ సత్యం వస్తే నా కొడుకు నేరం చేసినట్లు తెలుస్తాది. వాడికి తెలియనీయకూడదు బయట అల్లరి అవుతుంది.)

ఇంతలో పుల్లయ్య అక్కడికి వస్తాడు.

**సోమిరెడ్డి :** పుల్లయ్యా ఈ ధర్మాగారి అమ్మాయిని పాడుచేసి, ఏసిడ్ పోయించింది నీ కొడుకే అని అంతా చెబుతున్నారయ్యా.

**పుల్లయ్య :** మా అబ్బాయా

**ధర్మా :** అంత నెమ్మదిగా అంటావేం, వాడే

**సోమిరెడ్డి :** పుల్లయ్యా, నీ కొడుకు నా కొడుకు లాంటి వాడే కదా, ఈ అమ్మాయికి మనం న్యాయం చేయాలి కదా।
నీ కొడుకుని ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకోమను.

**పుల్లయ్య :** ఈ అమ్మాయినా

**గోకులం రాజు :** నేరం నీ కొడుకు చేసాడు కదా, నా చెల్లి రోజాతో కూడా మొన్న అసభ్యంగా ప్రవర్తించాడు. నీ కొడుకు బుద్ధి మంచిది కాదు, కాబట్టి ఆ అమ్మాయిని చేసుకోమను.

**పుల్లయ్య :** ముఖం కాలిన ఈ అమ్మాయిని చేసుకొనేందుకు వాడు ఒప్పుకోడు.

**సోమిరెడ్డి :** (తనలో, ఎలాగోలా మహిని పుల్లయ్య కొడుకు సత్యానికి అంటగడితే నా కొడుకు నేరం నుంచి తప్పించబడతాడు.) సరే పుల్లయ్య కంగారు లేదు, పెద్దలం మేం ఉన్నాం కదా।

మళ్ళీ మనం తర్వాతి సిట్టింగ్‌లో సెటిల్‌మెంట్ చేస్తా. అందాకా ఈ విషయం మీ సత్యానికి చెప్పకు. బయట ఎవరికీ చెప్పకు

**పుల్లయ్య :** అలాగే నండి.

(పుల్లయ్య జరిగిన మోసాన్ని గ్రహించలేక, తన బంధు మిత్రులకు తెలియచేయాలి అనే ఆలోచన లేక ఎదిగిన తన కొడుకుకి నిజం చెప్పాలనే భాద్యత లేక సత్యానికి సత్యం చెప్పడు.)



లక్ష్మితో పందెం గెలిసేందుకు పర్తిరెడ్డి, మేనమామ శ్రీనివాసరెడ్డి, హుస్సేన్, మహి, రోజా, శాస్త్రి, శెట్టిలతో కల్సి ఒక పథకం వేస్తారు. పథకం ప్రకారం మహి, రోజాల స్నేహితురాళ్ళను సత్యం వెంట పడేలా చేస్తారు. వాళ్ళు సత్యానికి కనపడేలా ఎదురై వింత సైగలు చేస్తూ, సత్యానికి ప్రక్కనుంచి పోతూ, అస్పష్టంగా అర్ధంలేని మాటలు మాట్లాడి వెళ్ళిపోతుంటారు. సత్యం కొన్ని రోజులు ఇది గమనిస్తాడు. అలాంటి సందర్భంలో ఒక రోజు టిఫిన్ చేస్తూండగా ఒక ఫోన్ వస్తుంది.

**సత్యం :** హలో ఎవరండి ?

**అవతలి కంఠం :** గుర్తుపట్టు

**సత్యం :** మీరెవరండి?

**అవతలి కంఠం :** నేనెవరినో తెలీదా

**సత్యం :** తెలీదు

**అవతలి కంఠం :** నీవెనుక చాలా సార్లు తిరిగాను.

**సత్యం :** ఇంతకీ ఎవరు మీరు?

**అవతలి కంఠం :** నన్నెక్కడ చూసావో గుర్తు తెచ్చుకో

**సత్యం :** ఏమో

**అవతలి కంఠం :** Yellow boost

**సత్యం :** హలో అంటాడు. ఇంతలో అవతలి వైపు లైన్ కట్టవుతుంది.

**సత్యం :** ఎవరబ్బా, ఎవరిదీ గొంతు, ఈ మధ్యన ఎవరో అమ్మాయిలు కనబడుతున్నారు. ఏవో సైగలు చేస్తున్నారు.

ఎవరీ ఫోన్ చేసిన అమ్మాయి. ఎక్కడ కనిపించింది. మొన్న లైబ్రరీ దగ్గర ఒక అమ్మాయి కనిపించింది. నిన్న బుద్ధుడి గుడిదగ్గర ఒకామె కనిపించింది. అంతకు ముందు వంతెన దగ్గర ఒకామె కనిపించింది ఎవరీమె.

రోజూ సత్యం తన డైరీలో తను చూస్తున్నవి. వింటున్నవి రాస్తుంటాడు. అలా రాసుకుంటూ అందరి అబ్బాయిలలానే తన ఊహాసుందరి గూర్చి రాసుకొంటూ ఉంటాడు. క్రమంగా సత్యం తన చుట్టూ తిరిగే పర్తిరెడ్డి ఎరేంజ్ చేసిన అమ్మాయిల వైపు ఆలోచించడం మొదలెడతాడు.

పుల్లయ్య ఒకరోజు సత్యంతో, సత్యం ఏం ఆలోచిస్తున్నావు.

**సత్యం :** గత కొద్ది రోజులుగా ఎవరో అమ్మాయిలు నా వెంట పడుతున్నారు. ఎవరా అని ఆలోచిస్తున్నాను.

**పుల్లయ్య :** పర్తిరెడ్డి కపటనాటకం తెలియని పుల్లయ్య, నీ వెంట అమ్మాయిలు పడుతున్నారా, ఏంటి ఇలా మాట్లాడుతున్నావు. నువ్వు ఈ మధ్య విపరీతంగా ఆలోచిస్తున్నావు.

**సత్యం :** అలాంటిది ఏది లేదు నాన్న

**పుల్లయ్య :** రాత్రి నీకు నిద్రపడుతుందా ?

**సత్యం :** బాగానే నిద్రపోతున్నా

**పుల్లయ్య :** నీ మాటలలో ఏదో తేడా ఉంది. భూత వైద్యుడికి చూపించాలి.

**సత్యం :** అదేం లేదు నాన్న

**పుల్లయ్య:** ఏ లేదంటే ఏదో ఉన్నట్లే. నాతోరా అని సత్యం చెప్పేది వినకుండా, అర్థం చేసుకోకుండా బలవంతంగా భూతవైద్యుడి దగ్గరకు తీసుకువెళ్ళి తావీజులు కట్టిస్తాడు.

---

సత్యాన్ని భూతవైద్యుడు దగ్గరకు తీసుకు వెళ్ళిన విషయం హుస్సేన్, శ్రీనివాసరెడ్డి, పర్తిరెడ్డి, శెట్టీలు తెల్సుకొని వివరాలు కనుక్కొనేందుకు సత్యం లేని సమయంలో పుల్లయ్య ఇంటికి వెళ్తారు. ఇంటి దగ్గర పుల్లమ్మ ఒకత్తే ఉంటుంది.

**హుస్సేన్ :** పుల్లమ్మగారు మీ అబ్బాయికి ఏమైంది.

**పుల్లమ్మ :** ఎవరో అమ్మాయి తనకు కనపడింది. వెంట పడింది అని ఏదో అంటున్నాడు.

**పర్తిరెడ్డి :** ఏ అమ్మాయో చెప్పాడా, చెబితే చెప్పండి పెళ్ళి చేసేద్దాం !

**పుల్లమ్మ :** ఏవో కాగితాల మీద రాసాడు.

**పర్తిరెడ్డి :** ఏం రాసాడు, ఆ పేపర్లు ఇలా ఇవ్వండి.

**పుల్లమ్మ :** సత్యం పర్సనల్ డైరీ, సత్యం రాసిన కొన్ని పేపర్లు ఇస్తుంది.

**హుస్సేన్ :** ఇవి మేం చదివి, ఏం రాసాడో చూసి మీకు ఇస్తాం.

**పుల్లమ్మ :** సరే అలాగే పట్టుకెళ్ళండి అంటుంది.

హుస్సేన్ పర్తిరెడ్డి, శెట్టి, శ్రీనివాసరెడ్డి బయటకు వచ్చేస్తారు.

**హుస్సేన్ :** ఈ పేపర్లో ఏం రాసాడు

**పర్తిరెడ్డి :** (చదివి) సత్యం గత కొన్ని రోజులుగా చూసిన సంఘటనలు గురించి, తన పర్సనల్ విషయాలు గూర్చి రాసుకున్నాడు. ఇందులో మనం ఎరేంజ్ చేసిన అమ్మాయిలు, వాళ్ళతో మనం ఆడించిన నాటకం గూర్చిరాసాడు. మన దొంగ నాటకం కనిపెట్టి వీడు ఇంత ఖచ్చితంగా ఎలా రాసాడో అర్థం కావటల్లేదు. ఇవి పుల్లయ్య చదివి, నమ్మి ఉంటే, లక్ష్మికి తెలిస్తే మనం పందెంలో ఓడిపోతాం.

**హుస్సేన్ :** అయితే కథ మార్చుదాం

శెట్టి, శాస్త్రి, హుస్సేన్‌లతో కల్సి పర్తిరెడ్డి, శ్రీనివాసరెడ్డి, సత్యం చేతి వ్రాతను కాపీ చేసి తమకు అనుకూలంగా మహిని ప్రేమించినట్లు రాస్తారు.

లక్ష్మి దగ్గరకు అవి పట్టుకొని వెళ్ళి లక్ష్మికి చూపించి, సత్యం మహిని ప్రేమిస్తున్నట్టు చెబుతారు. లక్ష్మి నమ్మక పుల్లయ్య, పుల్లమ్మల దగ్గరకు వెళ్ళి సత్యం విషయం అడుగుతుంది. పుల్లయ్య, పుల్లమ్మలు పూర్తి నిజం తెల్సుకోకుండా లక్ష్మితో హుస్సేన్, పర్తిరెడ్డి, శాస్త్రి, శెట్టిలు చెప్పింది నిజమని చెబుతారు. (అసలు జరిగినది ఏమిటో ఇటు లక్ష్మి అటు పుల్లయ్య, పుల్లమ్మలు తెల్సుకోలేక పోతారు.)

హుస్సేన్, శ్రీనివాసరెడ్డి, పర్తిరెడ్డి, శెట్టి, శాస్త్రిలు లక్ష్మిని పందెంలో ఓడిపోయేవు, నువ్వు మేం చెప్పినట్లు చేయాలి అంటారు. లక్ష్మి ఒక సారి సత్యాన్ని అడుగుదాం నిజం తెలుస్తుంది అంటుంది. వాళ్ళు ఒప్పకోక ఈ పందెం విషయం పెద్దలలో పెడదాం అంటారు. వాళ్ళు ఏరేంజ్ చేసిన వాళ్ళ పెద్దలు సోమిరెడ్డి, గోకులంరాజు, డా॥ఆర్.కె, డా॥ఆలీ, రోజా, నాజర్, ధర్మా, పుల్లయ్యలను పిలిచి ఒక పంచాయితీ ఏర్పాటు చేస్తారు, వాళ్ళు స్వార్థంతో పథకం ప్రకారం సత్యాన్ని పిలవకుండా, ఈ విషయం సత్యానికి తెలియకుండా రహస్యంగా ఉంచుతారు.

***సోమిరెడ్డి :*** లక్ష్మి, నువ్వు శ్రీనివాసరెడ్డి, హుస్సేన్‌లు కాసుకున్న పందెంలో, నువ్వు ఓడిపోయేవు అంటున్నారు.

***లక్ష్మి :*** నిజం తెలియక మీరలా అంటున్నారు.

***హుస్సేన్ :*** సత్యం వేరే అమ్మాయిని ప్రేమించినట్లు రాసిన పత్రాలు ఇవిగో.

***లక్ష్మి :*** సత్యాన్ని ఒకసారి పిలిచి అడిగితే నిజం తెలుస్తుంది కదా ?

***శ్రీనివాసరెడ్డి :*** మన పందెం ప్రకారం సత్యానికి మన కథ తెలియకూడదు, ఇప్పుడు సత్యాన్ని పిలిచి అడిగితే మన పందెం కథ తెల్సిపోతుంది.

***డా॥ఆర్.కె :*** నేను, నా కొడుకు శెట్టి రాజ్‌కుమార్, హుస్సేన్, శ్రీనివాసరెడ్డిలను వెనకేసుకొని రాను, దీనికి ఒక పరిష్కారం ఉంది, నేను చెప్పినట్టు చేస్తే సరిపోతుంది.

లక్ష్మి, షరీఫ్‌లు: ఏంటది ?

***డా॥ఆర్.కె :*** సత్యం బ్రెయిన్ స్కానింగ్ చేసి, బ్రెయిన్ మ్యాపింగ్, రీడింగ్ చేద్దాం, మేము అమెరికాలో మా రీసెర్చ్ సంస్థలో కొందరు పేషెంట్స్ విషయంలో ఇది చేస్తుంటాము. అసలు సత్యం బ్రెయిన్‌లో ఏముంది అన్నది తెలుస్తుంది.

***డా॥అలి :*** అవును ఇది చాలా రేర్ కేసులలో మా డాక్టర్లం చేస్తుంటాం. మన ఇండియాలో దీనికి అనుమతి లేదు. కాబట్టి అతి రహస్యంగా చేయాలి.

పెద్దలుగా అనబడేవారందరూ చేయిద్దాం అంటారు. లక్ష్మి, పుల్లయ్య, షరీఫ్‌లకు బ్రెయిన్ స్కానింగ్, బ్రెయిన్ మ్యాపింగ్, బ్రెయిన్ రీడింగ్ అంటే ఏమిటో తెలియకపోయినా అవి చేస్తే నిజాలు తెలుస్తాయి అనుకొని దానికి ఒప్పుకొంటారు.

***రోజా :*** పుల్లయ్య గారు మీ అబ్బాయి మీద నాకు ఎలాంటి కోపం లేదు, అతని ప్రవర్తన కొంత

అనుమానంగా ఉంది. అతని డైరీ, అతను రాసిన పేపర్లు చూసాకా అతని మనస్సు బాగోలేదేమో ననిపిస్తుంది. ఒకసారి డా॥ఆర్.కె. చెప్పినట్లు మానసిక వైద్యునికి చూపించండి. మీ కుటుంబానికి పూర్తి సపోర్టునిస్తాను. మీ సత్యం అంటే నాకు చాలా అభిమానం.

**పుల్లయ్య :** నిజంగా నా అదృష్టం తల్లి. నీలాంటిది నా కొడుకును సపోర్టు చేస్తాను అంటే నువ్వేది చెబితే అది చేస్తా.

**రోజా :** అయితే పుల్లయ్య గారు మనం ఇక్కడ మాట్లాడుకున్నది, ఇక మీదట జరిగేది ఏవిషయం కూడా మీ అబ్బాయి సత్యానికి తెలియకూడదు. అలా నాకు ప్రమాణం చేయండి.

**పుల్లయ్య :** ప్రాణం పోయినా మన మధ్య జరిగిన కథ నా కొడుకు సత్యానికి, బయటి ప్రజలకి చెప్పను.



**పర్తిరెడ్డి :** రోజా నన్ను పోలిన సత్యం నీతో అసభ్యంగా ప్రవర్తించేడు అని బలే కట్టుకథ అల్లాం. నువ్వు సత్యాన్ని అభిమానిస్తున్నట్లు బలే నమ్మించావు.

**రోజా :** పర్తిరెడ్డి నాకు, నీకు ఉన్న సంబంధాన్ని సత్యంతో ఉన్నట్లు పుల్లయ్యతో చెప్పి హాస్పిటల్‌కి పంపించమని చెప్పా.

**పర్తిరెడ్డి :** అసలు దొంగలం మనం అని పుల్లయ్యకు తెలియదు. మన రిసెర్చ్‌కి పుల్లయ్య కొడుకుని ఉపయోగించుకుందాం. రోజా నువ్వు వాడికి సపోర్టు చేస్తున్నట్లు నటించాలి. పుల్లయ్య వేలితో పుల్లయ్య కన్ను పొడవాలి. వాడి వర్గాన్ని, వాడి సపోర్టర్స్‌ని నీ తప్పుడు మాటలతో నమ్మించి, నీ ద్వారానే వాళ్ళందరినీ మన రీసెర్చ్‌లో ఇరికించాలి. రోజా, సత్యానికి సపోర్ట్ పేరుతో ఒక వర్గం నువ్వే సృష్టించి, వాళ్ళ ద్వారా సత్యానికి సపోర్ట్ ఇస్తున్నట్లు నువ్వే యాక్ట్ చేసి, ఆ సపోర్టర్స్ అందరినీ మన రీసెర్చ్ యజ్ఞంలో బందించాలి. ఇదే నువ్వు ఆడాల్సిన డబుల్ గేమ్.

**రోజా :** నీకు–నాకు ఉన్న ఈ సంబంధం మన రీసెర్చ్ టీం ఎప్పటికీ, ఎవ్వరికీ బయటకి తెలియనీయను. మన మెవరన్నది సత్యానికి కూడా తెలియదు. తెలియనీయకూడదు. పుల్లయ్య ద్వారానే ఈ డ్రామా ఆడుదాం.



ఈ సంఘటనకు ముందు తెర వెనుక జరిగిన కథ

సోమిరెడ్డి, గోకులం రాజు, డా॥ఆర్.కె. డా॥అలి, శాస్త్రి, పర్తిరెడ్డి, హుస్సేన్‌లు కూర్చుని ఉంటారు.

**సోమిరెడ్డి :** ఏంటి రాజుగారు, మనం ప్రపంచం మొత్తాన్ని స్వాధీనం చేసుకునే పథకం ఏమైనా ఉందా ?

**డా॥ఆర్.కె. :** రెడ్డిగారు నేను అమెరికాలో ఉండగా ఒక రహస్య రీసెర్చ్ మా టీంతో కల్సి చేసాను. నా ఫ్రెండ్ డా॥అలి అందులో మరో సభ్యుడు. మీరంతా సహకరిస్తాను అంటే ఒక

లోకల్ గొడవ సృష్టించి యజ్ఞం పేరుతో ఈ రీసెర్చ్‌ని ప్రజలపై చేసి మనం అనుకున్నది సాధించవచ్చు.

**శాస్త్రీ :** మీ రీసెర్చ్ ఏంటి డా॥ఆర్.కె.

**డా॥ఆర్.కె.:** మేము మెదడు వ్యాధుల నిపుణులం అని మీకు తెల్సుకదా, నేను డా॥అలీ, ఫారిన్‌లో అతి రహస్యంగా మానవ మెదడుపై పరిశోధనలు జరిపాం. బ్రెయిన్ స్కానింగ్ చేసి బ్రెయిన్ మ్యాపింగ్ ద్వారా బ్రెయిన్ రీడింగ్ చేయగలిగేం.

**పర్తిరెడ్డి :** బ్రెయిన్ స్కానింగ్ గూర్చి విన్నాం కాని ఈ బ్రెయిన్ మ్యాపింగ్, బ్రెయిన్ రీడింగ్ అంటే ఏంటి ఎప్పుడూ వినలేదు.

**డా॥ఆర్.కె :** బ్రెయిన్ మ్యాపింగ్, బ్రెయిన్ రీడింగ్ అంటే ఒక వ్యక్తి బ్రెయిన్ స్కాన్ చేసి అతనికి సంబందించిన ఆలోచనలు, వివరాలు తెల్సుకోవచ్చు మన భారతదేశంలో ఇలాంటి వాటికి అనుమతి లేదు. దీనికి బ్రెయిన్ కమ్యూనికేషన్ అనే వ్యవస్థను జోడించి ప్రయోగాలు చేసాం. ఫారిన్‌లో మేం చేసిన రీసెర్చ్ దీని మీదనే.

**శాస్త్రి :** అంటే మీ రీసెర్చ్ మనుషులపై జరిపారా ?

**డా॥అలి :** అక్షరాలా మానవులపైనే జరిపాం. దానిని ఎవరికి తెలియకుండా చేసాం. మా రీసెర్చ్ మానువుని బ్రెయిన్‌తో నేరుగా వైర్‌లెస్ కమ్యూనికేషన్ వ్యవస్థను ఏర్పాటు చేయడం.

ఇది సక్సెస్ అయ్యింది. దీనిని టెస్ట్ ట్రైల్‌గా ఒక చిన్న పట్టణం పై ప్రయోగించి దానిని విస్తరించి, మొత్తం భూమిని మన స్వాధీనం చేసుకోవచ్చు. సమాంతర ప్రభుత్వం మన రీసెర్చ్ టీంతో నెలకొల్పవచ్చు.

**డా॥ఆర్.కె:** దీనికి ఒక పథకం ఉంది. దానిని అతి రహస్యంగా అమలు చేయాలి. దానికి ఒక అమాయక కుటుంబం బకరా(మేక) అవ్వాలి. ఒక చిన్న వివాదం సృష్టించి ఆ కుటుంబాన్ని అందులో ఇరికించి మన మానవ బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థను వాళ్ళలో అమర్చి వాళ్ళను అడ్డం పెట్టుకొని మొత్తం ప్రజలు అందరినీ వాళ్ళకు తెలియకుండా ఈ వ్యవస్థకు బందీలు చేద్దాం. ఒక రకంగా సైంటిఫిక్ నాలెడ్జితో మాస్ హిస్టీరియా సృష్టించడం అయితే ఇక్కడ చాలా జాగ్రత్తలు తీసుకోవాలి, అమెరికాలో ఒక వ్యక్తికి బ్రెయిన్ రీడింగ్ చేసి బ్రెయిన్ కమ్యూనికేషన్‌ను ఏర్పాటు చేస్తే అక్కడి డాక్టర్లను జైల్‌లో పెట్టారు. మన విషయం బయటకు తెలియకూడదు.

**సోమిరెడ్డి :** మీకు ఇంకా ఎవరి సపోర్ట్ అయినా కావాలా ?

**డా॥అలి :** మీ ప్రక్క కూర్చున్న గోకులం రాజుగారు మా రీసెర్చ్ టీం మెంబర్, కంప్యూటర్ & కమ్యూనికేషన్ వ్యవస్థలకు చెందిన సపోర్ట్ మాకు ఈ రాజుగారి నుంచే లభించింది.

**పర్తిరెడ్డి :** అయితే ఒకడిని టార్గెట్ చేసి ఒక కుటుంబానికి వివాదం సృష్టించి, ప్రజలను రెండు వర్గాలుగా మనమే విడదీసి మన రీసెర్చ్‌లో బందీలను చేద్దాం. ప్రజలకు మనం బయటికి చెప్పేది ఒకటి, లోపల మనం చేసేది ఒకటి. అసలు మన రీసెర్చ్ రహస్యం ప్రజలకు తెలియకూడదు. అంతా అలాగే అంటారు.

**పుల్లయ్య :** సత్యం అలా బయటకి వెళ్దాం రా

పుల్లయ్యతో సత్యం బయటికి అని నమ్మి వెళ్తాడు, పుల్లయ్య రోజా చెప్పిన ఒక ఆసుపత్రికి సత్యాన్ని తీసుకువెళ్తాడు. ఆ హాస్పటల్‌లో

**డా॥ఆర్.కె:** మీ అబ్బాయి ప్రోబ్లం ఏమిటి ?

**పుల్లయ్య :** ఎవరో అమ్మాయి, ఏదో అని ఏదో చెబుతున్నాడు. ఏదో తనకు తెల్సిన విషయాలు అని పేపర్ మీద ఏవో రాస్తున్నాడు.

**డా॥ఆర్.కె.:** ఏం రాసావయ్యా సత్యం, ఆ పేపర్స్ ఏవి ? పుల్లయ్య కొన్ని పేపర్స్ చూపిస్తాడు.

**డా॥ఆర్.కె:** ఒక నిముషం ఆ పేపర్స్ చదివినట్లు యాక్ట్ చేసి సో బ్యాడ్, మీ అబ్బాయికి మందులు రాస్తాను అవి వాడించండి.

**డా॥ఆర్.కె.:** 2ని॥ పుల్లయ్యతో సత్యంతో మాట్లాడినట్లు నమ్మించి, మందులు మూడు నెలలకు రాస్తున్నా, మూడు నెలలు తర్వాత రండి అని పంపిస్తాడు.

**డా॥ఆర్.కె.:** పుల్లయ్యను పంపిన తర్వాత అతనికి గోకులం రాజు దగ్గరనుంచి ఒక ఫోన్ వస్తుంది.

**గోకులం రాజు :** డా॥ఆర్.కె నేను గోకులం రాజుని మాట్లాడుతున్నాను. సత్యానికి ఏం చెప్పారు.

**డా॥ఆర్.కె.:** 3 నెలలకు మందులు రాసాను.

**గోకులం రాజు :** సత్యాన్ని జీవితాంతం మందులు వాడేలా చేసి మన రీసెర్చ్‌ని వాడిపై చేస్తూ మన యజ్ఞంలో వాడిని, వాడి కుటుంబాన్ని ఇరికిద్దాం. మొత్తం మీద మన రీసెర్చ్ కోసం ఒక బకరా దొరికింది.

---

సత్యం మందులు వాడుతూ ఉంటాడు. పథకం ప్రకారం కొంత కాలం తరువాత సత్యాన్ని హాస్పిటల్‌లో చేర్పించి బ్రెయిన్ స్కానింగ్ చేసి బ్రెయిన్ మ్యాపింగ్ చేయించి సత్యం బ్రెయిన్‌తో కమ్యూనికేషన్ ఏర్పర్చాలి కాబట్టి నిత్యం సత్యం చుట్టూ తమ అనుచరులను త్రిప్పుతూ సత్యానికి ఎవరో ఫాలో అవుతున్నారు అనే ఫీలింగ్ తెప్పిస్తారు. సత్యం మరల ఆవిషయం పుల్లయ్యకి చెబితే ముందే అనుకున్న పథకం ప్రకారం సత్యాన్ని డా॥రంగారావు హాస్పిటల్‌కి చేర్పిస్తారు. అక్కడ సత్యానికి తెలియకుండా డా॥ఆర్.కె, డా॥రంగారావు, డా॥అలీలు సత్యానికి బ్రెయిన్ మ్యాపింగ్ చేసి తమ రీసెర్చ్‌లో కొనుగొన్న బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థను అమర్చి బ్రెయిన్ రీడింగ్ మొదలుపెడతారు.

ఈ డాక్టర్లు బ్రెయిన్ మ్యాపింగ్, బ్రెయిన్ రీడింగ్‌ల ద్వారా వచ్చిన సత్యం రిజుల్టును తప్పుగా చూపించి సత్యం మహిని ప్రేమించాడని, సత్యం రోజాతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడని తప్పుగా రిపోర్ట్ రాస్తారు. అది తెలియని లక్ష్మి, పుల్లయ్యలు అది నిజం అని నమ్ముతారు. లక్ష్మి తను హుస్సేన్, పర్తిరెడ్డి, శ్రీనువాసరెడ్డిలతో పందెం ఓడిపోయేనని భావిస్తుంది.

హుస్సేన్, శ్రీనివాసరెడ్డి, పర్తిరెడ్డిలు లక్ష్మి నువ్వు పందెంలో ఓడిపోయేవు, నువ్వు మేం

చెప్పినట్టు చేయాలి.

**లక్ష్మి :** ఏం చేయాలి.

**పర్తిరెడ్డి :** ఇక మీదట నువ్వూ, వల్లీ మేం చెప్పిన చోటికి వెళ్ళి రోజు వ్యభిచారం చేయాలి. బ్రెయిన్ మ్యాపింగ్ చేయించేటపుడు మా డాక్టర్ల సహాయంతో సత్యం, బ్రెయిన్‌లో నానో సెన్సార్లు అమర్చాం, దీని ద్వారా సత్యం ఇక మీదట ఏమి ఆలోచిస్తున్నాడు, ఏమి చూస్తున్నాడు అన్నది తెలుస్తాయి. నువ్వు మేం చెప్పిన మాట వినకపోయినా, బయట ఎక్కడైనా చెప్పినా సత్యం బ్రెయిన్‌లోని సెన్సార్లను రిమోట్ ద్వారా ఆపరేట్ చేస్తూ హై ఫ్రీక్వెన్సీలో వేవ్స్ పంపించి అతని బ్రెయిన్ డెడ్ అయ్యేలా చేస్తాం. ఇది ఫారిన్ టెక్నాలజీ, నువ్వు బయట ఎక్కడ చెప్పినా ఎవరూ నమ్మరు. సత్యాన్ని బ్రెయిన్ డెడ్ చేసి చంపినా ఆధారాలు ఉండవు. అని బెదిరిస్తారు. ప్రతిరోజూ రాత్రి కాగానే లక్ష్మి,వల్లీ,దేవీలను రోజూ ఒక కారులో నగ్నంగా కూర్చోబెట్టి వైజాగ్ నుంచి భీమిలికి తీసుకువెళ్ళి అక్కడ వాళ్లతో వ్యభిచారం చేయిస్తుంటారు ఈ దొంగల ముఠా.

గత్యంతరం లేక లక్ష్మి, వల్లీలు సత్యం కోసం రోజూ వాళ్ళు చెప్పిన చోటికి వెళ్ళి వ్యభిచారం చేస్తుంటారు. సత్యం ఈవిషయాలు ఏమీ తెలియక మందులు వాడుతుంటాడు.

శాస్త్రి, శెట్టి, పర్తిరెడ్డి, హుస్సేన్‌ల పథకం ప్రకారం పుల్లయ్య కొడుకు సత్యాన్ని ప్రేమిస్తున్నట్టు అందుకోసం పోట్లాడుకుంటున్నట్టు రోజా, మహీలు చెరో వర్గాన్ని ఏర్పాటు చేసుకుంటారు. ఈ రెండు వర్గాల మధ్య సత్యం కోసం పందెం కాసుకున్నట్లు నాటకం ఆడుతూ, సత్యాన్ని ఎవరైనా అమ్మాయి వివాహం చేసుకోదల్చుకుంటే ముందు సత్యం కంటపడాలని, సత్యం ఆ అమ్మాయిని పట్టించుకోక పోతే ఆ అమ్మాయి పర్తిరెడ్డి గెస్ట్‌హౌస్‌కి వెళ్ళి పర్తిరెడ్డి, హుస్సేన్, శెట్టి బృందంతో ఒక రాత్రి గడపాలనే నియమం పెడతారు. బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థద్వారా సత్యానికి ఎదురుగా అమ్మాయి వచ్చినపుడు ఆమెవైపు చూడకుండా సత్యాన్ని డైవర్ట్ చేస్తూ, సత్యం ఆ అమ్మాయిని పట్టించుకోలేదు అని చెప్పి ఆ అమ్మాయిని తమ గెస్ట్‌హౌస్‌కి తీసుకువెళ్ళి ఒక రాత్రి ఆమెతో గడిపి బ్లూ ఫిల్మ్ తీసి బయట ఎక్కడ అయినా చెబితే మీ పరువు పోతుంది అని బెదిరించి, ఆ అమ్మాయి శరీరంలోకి బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థను అమర్చి వాళ్ళకు తెలియకుండా బ్రెయిన్ రీడింగ్ మొదలుపెట్టి వాళ్ళను తమ బందీలుగా చేసుకుంటారు.

ఆ పట్టణంలో ఈ రకంగా చాలా మంది కుటుంబాలను ధర్మా, పర్తిరెడ్డి, హుస్సేన్, శెట్టి, శాస్త్రిల బృందం తమ రీసెర్చ్ యజ్ఞంలో బందీలను చేస్తారు. అయితే ఆ ప్రజలకు ఈ విషయం తెలియదు.



**డా॥ఆర్.3.:** డా॥అలీ, పర్తిరెడ్డి, రోజాలు మాట్లాడుకొంటుంటారు.

**డా॥ఆర్.3.:** రోజా, సత్యం మన చేతిలో కీలుబొమ్మ

**రోజా :** ఇది ఎలా సాధ్యం ?

**డా॥ఆర్.3.:** మన రీసెర్చ్ ద్వారా వాడు చూసేది, వాడు ఆలోచించేది, చేసే ప్రతి పని బ్రెయిన్

కమ్యూనికేషన్ ద్వారా (బ్రెయిన్ రీడింగ్ ద్వారా) మనకు తెల్సిపోతుంది. ఇది ఫారిన్‌లో మేం రీసెర్చ్ చేసి సాధించినది. దీనిని ఇక్కడ టెస్ట్ ట్రయల్‌గా సత్యం పై, మిగతా ఈ సిటీ ప్రజలపై ప్రయోగించాం. ఇది బ్రెయిన్ హ్యాకింగా చెప్పవచ్చు. మన ఈ కమ్యూనికేషన్ వ్యవస్థ ఇక్కడి ప్రజలకు తెలియని కొత్త విషయం.

***రోజా :*** డా॥ ఆర్.కె మనం ఈ బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థ ద్వారా సత్యాన్ని ఎలా కనెక్ట్ కాగల్గుతున్నాము ? ఇందులోని ప్రత్యేక అంశాలు ఏమిటి ?

డా॥ఆర్.కె. ఇలా చెబుతాడు

1. దీని ద్వారా ప్రత్యేక ఫ్రీక్వెన్సీలో సెల్‌ఫోన్ తో మాట్లాడినట్లు సత్యం బ్రెయిన్‌తో కనెక్ట్ అయ్యి నేరుగా మన మాటలను అతనికి వినిపించవచ్చు.

2. అతను చూస్తున్న ముఖం, ఫోటోలను, చదువుతున్న అక్షరాలను కొన్ని సెకన్ల పాటు అతని బ్రెయిన్‌కి మన కంప్యూటర్ గ్రాఫిక్స్ ద్వారా వేరేలా చూపించవచ్చు. ఇక్కడ అతని బ్రెయిన్ దృక్ కేంద్రానికి (ఆప్టికల్ సెంటర్) సెన్సార్ అమర్చటం వలన మన పంపించే దృశ్యాన్ని, ఆ సెన్‌సార్ గ్రహించి అతనికి ఆరకంగా చూపిస్తుంది.

3. సత్యం అవతలి వాళ్ళ మాటలు వింటున్నపుడు ఆ మాటలు వినిపించకుండా చేయవచ్చు.(మెదడులోని శ్రవణ కేంద్రాన్ని పనిచేయకుండా చేయటం ద్వారా)

4. అనేక గొంతులతో మనం సత్యానికి మాటలు ఈ కమ్యూనికేషన్ ద్వారా వినిపించవచ్చు.

5. మనం హై ఫ్రీక్వెన్సీలో వేవ్స్ పంపి మత్తు, తలపోటు రప్పించి స్పృహకోల్పేయేటట్లు చేసి కోమాలోకి పంపించవచ్చు, బ్రెయిన్ డెడ్ చేయవచ్చు.

6. పక్షవాతం లేదా శరీరభాగాలు చచ్చుపడిపోయేలా చెయ్యవచ్చు

7. ఈ పద్దతిలో సత్యం బ్రెయిన్‌ని కొన్ని క్షణాల పాటు చైతన్య రహితం చేసి అతనిని పరిసరాలనుండి సంబంధం లేకుండా చెయ్యవచ్చు.

8. మనం మాటలను ప్రోప్టింగ్ యిచ్చి అతనిలో ఆలోచనలు కల్గించవచ్చు, అవి అతని ఆలోచనలుగా చెప్పవచ్చు.

9. మనం అతను మాట్లాడుతున్నప్పుడు మాటలను తప్పుగా పలికేలా చెయ్యవచ్చు

10. కలలను కూడా ప్రోగ్రామింగ్ చెయ్యోచ్చు.

11. సత్యం జీవ వ్యవస్థలైన విసర్జక వ్యవస్త, నాడీ వ్యవస్థ, శ్వాస వ్యవస్థ, ప్రత్యుత్పత్తి వ్యవస్థలను నియంత్రించవచ్చు.

12. అతనికి తెలియని వ్యక్తుల పేర్లు వాళ్ళ ముఖాలు అతని బ్రెయిన్‌కి ఈ కమ్యూనికేషన్ ద్వారా నేరుగా చేరవేయవచ్చు.

13. కొన్ని క్షణాలు జ్ఞాపక శక్తిని బ్లాక్ చెయ్యోచ్చు.

14. ఈ పద్దతిలో అస్పష్టంగా, అర్థ రహితంగా మాటలను వినిపించి అతనిని అదే పనిగా ఆలోచించేలా చెయ్యోచ్చు

15. ఆలోచన పూర్తిగా వ్యక్తీకరణ కాకముందే తెలుసుకొని మిగిలిన ఆలోచనలను తప్పుగా కలిగించవచ్చు, లేదా మార్చవచ్చు.

16. వివిధ శబ్ధలరూపంలో మాటలను విచిత్రంగా వినిపించవచ్చు.

రోజా : మరి సత్యానికి ఈ విషయం తెల్సా ?

**డా॥ఆర్.కె.:** ఈ కమ్యూనికేషన్‌కి సంబంధించిన అనేక వివరాలు సత్యానికి ఇంతకంటే ఎక్కువే తెలుసు, అందుకే ఆ విషయాలు బయటకు రాకుండా అతనికి అనారోగ్యం అని అతని కుటుంబ సభ్యులతో చుట్టుప్రక్కల వారికి చెప్పిస్తున్నాము. బంధు మిత్రులను, ప్రజలను భ్రమలో పెడుతున్నాము. లేకుంటే ఈ రీసెర్చ్ చేసిన మన డాక్టర్‌లను, మన టీంని జైల్లో పెడతారు. అందుకే సత్యానికి బయటి ప్రపంచంతో సంబందం లేకుండా అతని సెల్‌ఫోన్, కంప్యూటర్ హ్యాక్ చేయటం జరుగుతుంది.

**రోజా :** సత్యం సెల్‌ఫోన్, కంప్యూటర్‌లు ఎలా హ్యాక్ చేస్తున్నారు ?

**పర్తిరెడ్డి :** ఈ నాటి ప్రజలు సెల్‌ఫోన్, కంప్యూటర్లు వాడుతున్నారు కాని, చాలా మందికి వాటిని హ్యాక్ చేసి ఎలా మోసం చేస్తారో తెలీదు. నేను ఎలా హ్యాక్ చేస్తానో చెబుతాను. ముందుగా ఒక సెల్‌ఫోన్ నెంబరు తెల్సుకొని ఆ సెల్‌ఫోన్ సాఫ్టవేర్‌ను హ్యాక్ చేసి ఆ సెల్‌ఫోన్ నుండి ఏ నెంబరుకి ఫోన్ చేసినా కాల్ డైవర్ట్ చేసి మన నెంబర్‌కి వచ్చేలా చేసి వాయిస్ మాడ్యులేషన్ అనే ఆప్షన్ ద్వారా గొంతు మార్చి మనం మాట్లాడవచ్చు. అలాగే కంప్యూటర్‌ను కూడా హ్యాక్ చేయవచ్చు, నెట్ కనెక్ట్ అయ్యి ఉన్నపుడు, నెట్‌తో కనెక్ట్ కాకుండా ఉన్నపుడు కూడా సెల్‌ఫోన్, కంప్యూటర్ లేదా లాప్‌టాప్‌లను హ్యాక్ చేయొచ్చు, వారి సిస్టంలోని సాఫ్ట్‌వేర్‌ను కాపీ చేసి, పాస్‌వర్డ్ తెల్సుకోవటం ద్వారా హేక్ చేయచ్చు. స్క్రీన్ షేరింగ్ అనే పద్దతి ద్వారా హ్యాక్ చేయొచ్చు. ఇలా హ్యాక్ చేసే పద్దతులు ఇంకా ఎన్నో ఎన్నెనో ఉన్నాయి.



సోమిరెడ్డి, గోకులం రాజు, డా॥ఆర్.కె, డా॥అలిలు పుల్లయ్యను కల్సి నీ కొడుకు జీవితాంతం మందులు వాడుతూ పిచ్చి వాడిలా ఉండాలి. మేము మా మ్యాన్ పవర్‌తో పిచ్చివాడని ప్రచారము చేస్తాం, ఇంటిలో కూడా మీ సత్యానికి ఆరోగ్యం బాగాలేదని చెప్పి నిజంగా పిచ్చిపట్టేటట్లు చేయాలి, వాడిని సరైన ఉద్యోగం, పెళ్ళి చేసుకోనివ్వం, వాడు మా రీసెర్చ్ టీం కోసం మేము తయారు చేసిన కోతి. మా మాటలు కాదంటే మా బ్రెయిన్ కమ్యూనికేషన్ సిస్టం ద్వారా బ్రెయిన్ డెడ్ అయ్యేలా చేస్తాం. ఎందుకంటే మీ సత్యం మేము రీసెర్చ్ చేస్తునట్లు కనిపెట్టేశాడు అంటారు.

**పుల్లయ్య :** సరేబాబు మీరేం చెబితే అది చేస్తా. ఇంటిలో కూర్చొబెట్టి సన్నాసిగా మారుస్తా. జనానికి వాడిని పిచ్చివాడని చెబుతా. మందులు సరిగ్గా వాడక పోవటం వల్ల వాడికి అనారోగ్యం వచ్చిందని ప్రచారం చేస్తా.

సత్యం బలవంతంగా మందులు వాడుతూ ఉంటాడు. పుల్లయ్య, సోమిరెడ్డి, పర్తిరెడ్డి,

గోకులం రాజు, హుస్సేన్‌ల చెప్పుడు మాటలు నమ్మి వాళ్ళు సత్యంపై రీసెర్చ్ చేస్తూ దొంగనాటకం ఆడుతున్నారని తెలుసుకోలేక పోతాడు.

**సత్యం :** నాన్న ఈ మందులు ఇక చాలు, ఇవి వేసుకుంటే చాలా సైడ్ ఎపెక్ట్స్ కల్గుతున్నాయి.

**పుల్లయ్య :** ఇవి వాడవలసిందే, నీ ఆరోగ్యం బాగోలేదని నీకు తెల్సా ? నాకు తెల్సా ? నేను బి.పి. మందులు వాడటం లేదు.

సత్యం కొన్ని సం॥ వాడిన తర్వాత ఆ సైడ్ ఎఫెక్ట్స్ భరించలేక మందులు వేసుకోను అని అంటాడు. డాక్టర్‌కి కూడా ఈ సంగతి చెబుతాడు. అయితే డాక్టర్ సైడ్ ఎఫెక్ట్స్ అసలు ఉండవు అని అవి వేసుకో అని చెబుతుంటాడు.

సత్యం చాలా సార్లు తనకు టాబ్లెట్స్ వల్ల కల్గుతున్న ఇబ్బందులను పుల్లయ్యకు చెప్పటానికి ప్రయత్నిస్తాడు, కాని సోమిరెడ్డి, గోకులం రాజు, హస్సేన్, రోజాల మాటలలో పడి, సత్యానికి అసలు నిజం చెప్పకుండా, అందరితో సత్యం ఆరోగ్యం బాగోలేదని అబద్దాలు చెబుతూ నిజంగానే పిచ్చి పుల్లయ్య ఔతాడు. ఒక రోజు

**సత్యం :** నాన్న ఈ టాబ్లెట్లు ఇక నేను వాడను, సైడ్ ఎఫెక్ట్స్ వస్తున్నాయి.

**పుల్లయ్య :** నువ్వు వాడను అన్నావంటే, మళ్ళీ నీకు అనారోగ్యం వచ్చింది అన్నమాటే, కోర్స్ పెంచి వాడాల్సిందే, నువ్వు ఈ మందులు జీవితాంతం వాడాల్సిందే.

సత్యం మౌనంగా ఆ టాబ్లెట్స్ వాడుతూ ఉంటాడు. ఆ టాబ్లెట్స్ ప్రభావం వల్ల సత్యం చేతి వేళ్ళు వణికిపోతుంటాయి. విపరీతంగా నీరసం వస్తుంది. ఫ్రిమోషన్ అవ్వక ఇబ్బంది పడుతుంటాడు. ఎవరితోను మాట్లాడలేని విధంగా డల్‌గా తయారవుతాడు. మందుల మత్తులో తన పక్క ఏమి జరుగుతుందో తెలియని స్థితిలో ఉంటాడు. టాబ్లెట్స్ ప్రభావం వల్ల రోజుకి 15గం॥ నిద్రపోతుంటాడు.

పుల్లయ్య, సత్యం అడిగిన ఏ ప్రశ్నకి సమాధానం చెప్పడు. సత్యాన్ని బుకాయించి నీ ఆరోగ్యం బాగోలేదని చెబుతుంటాడు.

సత్యం ఒక సారి తనను తాను ఎనాలసిస్ చేసుకుంటుండగా, ఒక స్నేహితుని ద్వారా సత్యంపై కొందరు రీసెర్చ్ చేస్తున్నట్లు చూ చాయగా తెలుస్తుంది. సత్యానికి తనతో బలవంతంగా ఇంతకాలం మందులు వాడించడం వెనుక రహస్యం తెలుస్తుంది. బలవంతంగా నా చేత టాబ్లెట్స్, ఇంజక్షన్లు వాడించడానికి కారణం ఇది అన్నమాట అనుకుంటాడు. ఆసందర్భంలో సత్యం పుల్లయ్యతో ఇక నేను మందులు వాడను అంటే రీసెర్చ్ టీం సలహాతో పుల్లయ్య సత్యం కాళ్ళు చేతులు బలవంతంగా కట్టి హస్పిటల్‌కి తీసుకెళ్ళి మందులు వాడాల్సిందే అని చెప్పించి మందులు వాడిస్తాడు.

సత్యం, పుల్లయ్య చెప్పినట్టు మందులు వాడుతూ ఉంటాడు. కాని పుల్లయ్య సత్యానికి ఏ నిజం ఎప్పుడూ చెప్పడు, సత్యం తన చుట్టూ జరిగే సంఘటనలను పుల్లయ్యకి వివరించబోతే పుల్లయ్య వినకుండా అది అంతా నీ భ్రమ, భ్రాంతి మళ్ళీ నీకు అనారోగ్యం తిరగబెట్టింది అని

అబద్దాలు చెప్పి కపట నాటకం ఆడతాడు. సత్యం తన తోటి వారందరికీ వివాహం అయిపోతుంటే తను కూడా చేసుకోవాలని చాలా సార్లు అనుకుంటాడు. అయితే పుల్లయ్య సత్యానికి అసలు వివాహ ప్రయత్నమే చేయడు, పైగా సత్యానికి అనారోగ్యం అని, సత్యంని వివాహం చేసుకోమంటే, చేసుకోవటం లేదు అని మాయ మాటలు చెబుతుంటాడు. బంధు మిత్రులు పుల్లయ్య యొక్క ఆ మాయ మాటలు నమ్మి నిజం అనుకుంటారు.

సత్యం తన బంధువుల అమ్మాయిలను కొందరిని చేసుకొంటానని చెప్పినా పుల్లయ్య, పుల్లమ్మ ఏవో వంకలు చెప్పి సత్యానికి పెళ్ళి కాకుండా చేస్తారు.

సత్యాన్ని పోలిన సోమిరెడ్డి కుమారుడు పర్తిరెడ్డి బ్రెయిన్ రీసెర్చ్ టీం సహాయంతో సత్యానికి బ్రెయిన్ రీడింగ్ చేయించి కమ్యూనికేషన్ ఏర్పాటు చేయడం ద్వారా సత్యం బ్రెయిన్ మెమోరీని దొంగిలించి బ్రెయిన్ రీడింగ్ ద్వారా సత్యం వ్యక్తిగత విషయాలు చిన్నప్పటినుండి పెద్దఅయినదాకా జరిగిన విషయాలు అన్ని తెలుసుకుంటాడు. వాటి ద్వారా తనే సత్యంగా చెప్పుకొంటాడు. తన తప్పులను సత్యం మీదకి తోసివేస్తాడు. సత్యానికి చెందిన ప్రూఫ్స్, ఐ.డిలను దొంగిలించి సత్యం బ్రెయిన్‌కి 24గంటలు తన మాటలను వినిపిస్తూ తద్వారా సత్యాన్ని పిచ్చివాడిలా మార్చాలని ప్రయత్నిస్తుంటాడు. పర్తిరెడ్డి సత్యాన్ని బ్రెయిన్ కమ్యూనికేషన్ ద్వారా ఇలా టార్చర్ పెడుతుంటాడు.

1. లం...కొ... నీకు అమ్మాయి కావలట్రా
2. నువ్వు పిచ్చివాడివి కావాలి
3. నువ్వు నీ మెమొరీ ఇస్తే చాలు మాకు
4. మేము దొంగలం, మోసగాళ్ళం నిరూపించుకో
5. పర్తిరెడ్డి రీసెర్చ్ చేయించాడని ఊరంతా చెప్పుకో
6. ఎదురు మాట్లాడితే నీ కుటుంబాన్ని చిత్రహింసలు పెట్టి కత్తిగాటు లేకుండా చంపుతాం
7. దేశం అంతా తిరుగు, ఎవరూ నమ్మరు.
8. నీ బ్రెయిన్ పాడైపోయిందని ఊరంతా చెబుతాం.



ఇలా సత్యాన్ని విసిగిస్తుంటారు. సత్యం ఈ విషయం పుల్లయ్యకు, తనకు వైద్యం చేసే డా॥ ఆర్.కె.కు చెబితే, ఆ రీసెర్చ్ టీం డాక్టర్లు సత్యానికి పిచ్చి అని చెప్పి వాళ్ళు చెప్పిన హాస్పిటల్‌లో చేర్పించి, సత్యానికి ఆరోగ్యం బాగాలేదని, అంతా భ్రమ, భ్రాంతి ష్కిజోఫ్రినియా అనే వ్యాధి అని అబద్ధం ఆడి బలవంతంగా మందులు వాడిస్తారు. డా॥ఆర్.కె ఇది అంతా చేసి అమాయకంగా, సత్యం మానసిక పరిస్థితి బాగోలేదని సర్టిఫై చేస్తుంటాడు.

గోకులం రాజు, సోమిరెడ్డి, డా॥ఆర్.కె., డా॥అలీ, శాస్త్రీ తమ మోసం ప్రజలకు తెలుస్తుంది అని భావించి తమ అనుచరుల ద్వారా సత్యానికి అనారోగ్యం అని ప్రచారం చేయిస్తుంటారు.

**వివేక్ :** అదేంటి ప్రొఫెసర్ సత్యాన్ని అంత దారుణంగా ఎలా పిచ్చివాడని ముద్రించారు. పుల్లయ్య ఎలా ఊరుకున్నాడు.

**ప్రొఫెసర్ :** సమస్య అంతా పుల్లయ్యతోనే వచ్చింది. పుల్లయ్య, పర్తిరెడ్డి రీసెర్చ్ టీం మాటలకు మొదట లోబడి, తర్వాత భయపడి, తన కొడుకు జీవితం కన్నా తను చేసిన నేరం బయటకు రాకూడదనే ప్రయత్నంలో సొంత కొడుకుని మోసం చేసి పిచ్చివాడు అని ముద్ర వేసి, బయటి ప్రపంచానికి తన కొడుకు సత్యం నిజంగా పిచ్చివాడని తానే కొడుకుకి వ్యతిరేఖంగా ప్రచారం చేసాడు. దీనికి తోడు సత్యం పోలికలతో ఉన్న పర్తిరెడ్డి పబ్లిక్‌లో సత్యం వలే ప్రవర్తిస్తూ, పిచ్చి పిచ్చి వేషాలు వేస్తూ తనే సత్యం అనే భ్రమ అందరికి కల్పిస్తాడు.

**వివేక్ :** పుల్లయ్య అలా ఎందుకు చేస్తాడు ప్రొఫెసర్?

**ప్రొఫెసర్ :** రామిరెడ్డి, పర్తిరెడ్డి, హుస్సేన్, రోజా బృందం లక్ష్మి, దేవి, వల్లీలతో తము చెప్పిన

చోటుకి వెళ్ళి పందెం ప్రకారం ప్రతిరోజు వ్యభిచారం చేయాలని చెప్పి చేయిస్తుంటారు. ఇది తెల్సికూడా పుల్లయ్య, జరిగిన తప్పులో తన పాత్ర కూడా ఉండటంతో తన పరువు పోతుందని, తన నేరం ప్రజలకు తెలుస్తుందనే భయంతో, సత్యం ఎక్కడ నిజం తెల్పుకుంటాడో ప్రజలకు తెలియజెపుతాడో, అనే భయంతో సత్యానికి పిచ్చి అని చెబుతుంటాడు. అలాంటి సంధర్భంలో సత్యం మొత్తం రిసెర్చ్ వివరాలను ఒక పేపర్ పై రాసి తన స్నేహితునికి ఇచ్చి తనని ఈ రిసెర్చ్ చేస్తున్న డాక్టర్ల చెర నుండి కాపాడమని కోరతాడు. అది తెలిసిన డాక్టర్ల బృంధం తమ రిసెర్చ్ వ్యవహారం బయట పడకూడదని భావించి సత్యానికి వ్యతిరేకంగా ఊరంతా ప్రచారం చేస్తుంది. సత్యం, స్నేహితుడు వాసు, తనకి సత్యం రాసిన లేఖ చదివి ప్రజలకు ఆ విషయాన్ని తెలపాలని భావిస్తాడు. అయితే రీసెర్చ్ టీం ఆ లేఖ ఎవరు చదివినా తల తీసేస్తాం అని ఊర్లో జనాలను బెదిరిస్తారు. నిజం, సత్యం ప్రజలకు చెబుతాడని పర్తిరెడ్డి రీసెర్చ్ టీం పెద్దలు ముందుగానే పుల్లయ్యని భయపెట్టి సత్యం భయట ఉంటే తమ రీసెర్చ్ టీం వివరాలు భయటకి ఎక్కడ చెబుతాడోనని, తమ రీసెర్చ్ టీం వ్యవహారం ప్రజలకు తెలుస్తుందని భావించి సత్యాన్ని ఒక పథకం ప్రకారం ఒక రోజు అర్ధరాత్రి పిచ్చాసుపత్రిలో పడవేస్తారు. అది ఎందుకంటే?

సత్యానికి బ్రెయిన్ కమ్యూనికేషన్ వ్యవస్థని అమర్చిన తరువాత తమ హాస్పటల్ చుట్టూ త్రిప్పుస్తూ తమ మందులు సత్యం పై టెస్టు చేస్తూ ఉంటారు. అలాగే సత్యం బ్రెయిన్ రీడింగ్ వినడాన్ని వ్యాపారంగా మలచి సత్యం బ్రెయిన్ రీడింగ్‌ను వీడియో గేమ్‌లా ఒక క్రొత్త ఆటగా ఆడుకుంటూ, పందాలు కాసుకొంటూ, డబ్బులు సంపాదిస్తారు. కొన్ని సంవత్సరాల తరువాత సత్యం గత కాలంనాటి పూర్తి చరిత్రను తెలుసుకొని తమ రీసర్చ్ పూర్తి చేసికొని సత్యన్ని పోలిన పర్తిరెడ్డి సత్యం ప్రూఫ్స్ దొంగిలిస్తాడు. అతని ఆధార్ కార్డు సెల్ సిమ్ విద్య అర్హతల సర్టిఫికెట్లు తనవిగా చూపించి సత్యం పేరుమీద రోజాతో కలసి అమెరికా వెళ్ళిపోతాడు. బ్రెయిన్ రీసర్చ్ చేసిన డాక్టర్లు ఇండియాలో సత్యన్ని పోలిన పర్తిరెడ్డి మీద బ్రెయిన్ రీసర్చ చేసినట్లు ఈ ఆధారాలతో అక్కడి తమ రీసర్చ్ సెంటర్‌లో చూపిస్తారు. అమెరికాలో ఈ రకమైన బ్రెయిన్ రీసెర్చ్ చెయ్యడానికి అక్కడి చట్టాలు ఒప్పుకోవు, కోట్లరూపాయిలు ఖర్చుపెట్టాలి కనుక సత్యాన్ని లోకల్ ఇష్యూలో ఇరికించి ఆ డాక్టర్లు పర్తిరెడ్డి సాయంతో ఇండియాలో సత్యాన్ని బ్రెయిన్ రీసెర్చ్‌కి వాడుకొని, అతని కుటుంబాని బ్లాక్‌మెయిల్ చేసి మానసికరోగి అని చెప్పి పిచ్చాసుపత్రికి పంపిస్తారు. వాళ్ళు ఆవిధంగా సత్యాన్ని బ్రెయిన్ రీసెర్చ్‌కి ఉపయోగించుకుంటారు.

అది వివేక్ ఉత్తరప్రదేశ్‌లో కొన్ని సంవత్సరముల క్రితం సత్యం విషయంలో మానవ బ్రెయిన్ రీసర్చ్ టీమ్ డాక్టర్లు చేసిన దుర్మార్గం.

వివేక్ ప్రొఫెసర్ మరి మా రఘు విషయంలో ఏమి జరిగిఉంటుంది.

**ప్రొఫెసర్ :** అది తెలియాలి అంటే ముందు మీ ఇంటిలో ఎవరెవరు ఉంటారో చెప్పు.

**వివేక్ :** మా ఇంటిలో అమ్మా, నాన్న, తమ్ముడు ఉంటాము.

**ప్రొఫెసర్ :** మీ ఇంటిలో కుటుంబ సంబంధాలు ఎలా ఉంటాయి ?

**వివేక్ :** చాలా బాగుంటాయి. అయితే గత మూడు సం॥గా ఇంటిలో నేను ఉండటం లేదు. ఎం.ఎస్.సి చదవటానికి నాగపూర్ వెళ్ళి, ఆ తర్వాత ఉద్యోగరీత్యా ఢిల్లీలో ఒక సం॥ పనిచేసి 3 నెలల క్రితం ఇంటికి వచ్చాను. మా ఫ్రెండ్ ఆనంద్ చనిపోయిన 3 నెలలకు నేను వైజాగ్ వదిలి వెళ్ళిపోయేను, మరలా ఇప్పుడు కలిసాను.

**ప్రొఫెసర్ :** అయితే గత 3 సం॥గా నువ్వు మీ ఇంటికి దూరంగా ఉంటున్నావు అన్నమాట.

సరే వివేక్ రేపు రండి మిగతా విషయాలు మాట్లాడుకుందాం అని తనలో, రఘు గతంలో ఏమి జరిగి ఉంటుందో అనుకుంటాడు.

మరుసటిరోజు వివేక్ రఘుని తీసుకొని ప్రొఫెసర్ దగ్గరకు వెళ్ళతాడు.

**ప్రొఫెసర్ :** రా వివేక్

**వివేక్ :** గుడ్ మార్నింగ్ ప్రొఫెసర్

**ప్రొఫెసర్ :** వివేక్, రఘు అలా కూర్చోండి.

**వివేక్ :** ప్రొఫెసర్ నిన్న సత్యం యొక్క బ్రెయిన్‌తో డాక్టర్ల రీసెర్చ్‌టీం బ్రెయిన్ కమ్యూనికేషన్ చేసింది అన్నారు. అది ఎలా సాధ్యం?

**ప్రొఫెసర్ :** అది తెల్సుకోవాలి అంటే ముందు మానవ మెదడు, దాని నిర్మాణం గూర్చి, ఎలక్ట్రానిక్ కమ్యూనికేషన్ వ్యవస్థల గూర్చి, వార్తా ప్రసరణను (కమ్యూనికేషన్) జరిపే వివిధ తరంగాల గూర్చి, వాటి ఫ్రీక్వెన్సీల గూర్చి తెల్సుకోవాలి. ఈ రోజు దానిని నీకు వివరిస్తాను.

మానవ శరీరంలో మెదడు అన్ని భాగాలను నియంత్రిస్తుంది. మెదడు న్యూరాన్స్ అనే కణాలతో ఉంటుంది. దీనిలో అనేక చర్యలు జరిగి శరీరం మొత్తాన్ని సమన్వయం చేయటం జర్గుతుంది. ఆలోచన అనేది మెదడులోంచి పుడుతుంది. ఆలోచన కలగటం అనేది సంక్లిష్ట యాంత్రిక చర్య.

మానవుని శరీరంలో ఏ కణాలు అయినా పుడుతూ, చనిపోతూ ఉంటాయి. కాని మెదడులోని కణాలు ఒక స్థాయికి వచ్చేకా కొత్తవి పుట్టడం జరుగదు.ఒక వేళ మెదడులో ఏ భాగం లోని కణాలు అయినా చనిపోతే ఆభాగం , శరీరంలోని ఏ అవయవాన్ని నియంత్రిస్తుందో ఆ అవయవం చచ్చుబడిపోతుంది.

మానవ మెదడు సుమారు 400 గ్రాముల బరువు (శరీరం మొత్తం బరువులో సుమారు 2% వరకు ఉండవచ్చు) ఉంటుంది.

మెదడులో సుమారు 10 బిలియన్‌ల కణాలుంటాయి, ఒకొక్క నాడీకణం ఇతర నాడీ కణాలనుండి సుమారు 1000 నుండి 10000 వార్తలను గ్రహించి, విద్యుత్ ప్రకంపనాలను సెకనుకి 0.6 నుండి 120 మీటరులు వేగంతో తీసుకొని పోతుంది. మెదడు, శరీరం మొత్తం తీసుకొనే ఆక్సిజన్‌లో 20% ఉపయోగిస్తుంది.

మెదడు లోని ఎడమ భాగం, శరీర కుడివైపు చర్యలను, మెదడు కుడిభాగం శరీరం ఎడమ భాగం చర్యలను నియంత్రిస్తుంది.

**వివేక్ :** ప్రొఫెసర్ అసలు మెదడు ఏరకంగా పనిచేస్తుంది ?

**ప్రొఫెసర్ :** వివేక్ మన మెదడులో 3 భాగాలుఉంటాయి.

1. ముందుభాగం (సెరిబ్రమ్)
2. మద్య మెదడు (మిడ్ బ్రెయిన్)
3. వెనుక మెదడు




**వివేక్ :** ముందు మెదడు ఎలా పని చేస్తుంది ?

**ప్రొఫెసర్ :** ఇది మెదడులో అతి పెద్ద భాగం, దీనిని మస్థిష్కం అని కూడా అంటారు. ఇది నిలువుగా రెండు భాగాలుగా ఉంటుంది, వీటి పై భాగాలను మస్థిష్క వల్కలం అని కూడా అంటారు.

ఈ మెదడు పైభాగం, మస్థిష్క వల్కలంలో వివిధ సమాచారాన్ని గ్రహించే అనేక జ్ఞాన కేంద్రాలు ఉన్నాయి. అవి

1. దృష్టి కేంద్రం (విజ్‌వల్ సెంటర్), 2. శ్రవణ కేంద్రం (ఆడిటరీ సెంటర్)
3. ఘ్రాణ కేంద్రం (ఆల్‌ఫ్యాక్టరీ సెంటర్) 4. వాక్ కేంద్రం (స్పీచ్)

**1. దృష్టి కేంద్రం :** మన ప్రధాన జ్ఞానాంగాలలో కళ్ళు ఒకటి, కనుగుడ్డుకు వెనుక వైపు ఉండే దృక్కు నాడి అనేది (ఆప్టిక్ నేర్వ్) మెదడును కంటితో అనుసందానము చేస్తుంది. ఈ దృక్కు కేంద్రం కళ్ళనుండి వార్తలను గ్రహించి వాటిని విశ్లేషిస్తుంది.

**2. శ్రవణ కేంద్రం :** శబ్ద తరంగాలు కర్ణభేరిని తాకి ప్రకంపనాలను కల్గిస్తాయి అప్పుడు చెవిలో విద్యుత్ ప్రచోధనాలు ఏర్పడి శ్రవణనాడి ద్వారా మెదడును చేరతాయి. కొన్ని పెద్ద శబ్దాలు చెవి ద్వారా మెదడును చేరకుండా కపాలం లోని ఎముకల ద్వారా నేరుగా మెదడును చేరతాయి. దీనినే బోనీ కండక్షన్ అంటారు. ఈ సూత్రం ఆధారంగా వైర్‌లెస్ కమ్యూనికేషన్‌ని నేరుగా బ్రెయిన్‌లో కొన్ని సెన్సార్లు అమర్చటం ద్వారా చేయవచ్చని ఆ దిశగా ప్రయోగాలు చేసి ఫలితం సాధించారు.

**3. ఘ్రాణ కేంద్రం :** ముక్కు రసాయిన పదార్థాల ఉనికిని వాసనల రూపంలో గ్రహించినపుడు ముక్కులోని గ్రాహకాలు విద్యుత్ ప్రవాహాన్ని కల్గిస్తాయి. ఈ విద్యుత్ ప్రవాహం ఘ్రాణ నాడి ద్వారా మెదడును చేరుతుంది. మెదడులోని ఘ్రాణ కేంద్రం వాసనలకు సంబందించిన వార్తలను విశ్లేషణ చేస్తుంది.

**4. నాలుక :** నాలుకపై రుచి కళికలు ఉండి అవి తీపి, పులుపు, ఉప్పు, చేదు వగరు రుచులను గుర్తిస్తాయి. నాలుకకు ఆహారంలోని రసాయినాలతో సంబందం కలగగానే గ్రాహక కణాలు విద్యుత్ ప్రచోదనాల రూపంలో సమాచారాన్ని మెదడుకు చేరవేస్తాయి.

మస్థిష్క వల్కలం పై ఉండే మెదడు లోని ఈ కేంద్రాలకి నేరుగా నానో సెన్సార్లును అమర్చటం ద్వారా బ్రెయిన్ కమ్యూనికేషన్ సాద్యమవుతుంది.

**వివేక్ :** ప్రొఫెసర్ ఇంకా మెదడులోని ముందు భాగం (మస్థిష్కం) ప్రత్యేకత ఏమిటి ?

**ప్రొఫెసర్ :** ఇది మన తెలివితేటలకు ముఖ్య కేంద్రం, ఆలోచించడం, నేర్చుకోవడం, గుర్తుపెట్టుకోవడం, గుర్తు చేసుకోవడం అనేవి మెదడులోని ఈ భాగం వలన జరుగుతాయి.

మస్థిష్కం దిగువున ఉండే మెదడు భాగాన్ని ద్వార గోర్థం అంటారు. ఈ భాగంలో కోపం, బాధ, ఆనందం వంటి భావావేశాన్ని నియంత్రించే కేంద్రాలు ఉంటాయి. మెదడులోని ఈ భాగంలో ఉండే హైపోథలామస్‌లో ఉష్ణాన్ని ఆకలిని, దాహాన్ని నియంత్రించే కేంద్రాలు ఉంటాయి.

మద్యమెదడులో నాడీ కణాలు శరీర కండరాలను వాటి కదలికలను నియంత్రిస్తాయి. ఇది సరిగ్గా పనిచేయకపోతే శరీర భాగాలలో జర్క్స లాంటివి వస్తాయి.

వెనుక మెదడులో అనుమస్థిష్కం (సెరిబెల్లం), మెదడు కాండం(బ్రెయిన్ స్టెమ్)అను రెండు భాగాలు ఉంటాయి

మెదడు కాండంలో 2 భాగాలు ఉంటాయి. అవి పాన్స్ వెరోలి, మజ్జాముఖము (మెద్యూల్లా)

శ్వాసక్రియ, హృదయస్పందనము, రక్తపీడనము, శరీర ఉష్ణోగ్రత లాలాజల గ్రంధుల

స్రావము వంటి చర్యలను నియంత్రించే కేంద్రాలు మజ్జాముఖములో ఉంటాయి.




ఇవి వివేక్, మెదడులోని భాగాలు, వాటిలోని కేంద్రాలు అవిచేసే పనులు, ఈ కేంద్రాలలో నానో సెన్సార్లను అమర్చడం ద్వారా వాటికి సమాచారాన్ని పంపించవచ్చు, వాటినుండి సమాచారాన్ని గ్రహించవచ్చు.

**వివేక్ :** మరి నాడులు, నాడీ వ్యవస్థ అంటే ఏమిటి ప్రొఫెసర్ ? వాటి నిర్మాణం ఏమిటి అవి వార్తలను ఏవిధంగా మెదడుకు చేరవేస్తాయి.?

**ప్రొఫెసర్ :** నాడీ వ్యవస్థ నాడీ కణాలతో ఏర్పడుతుంది. నాడీ కణం పొడవుగా తీగ వలే ఉంటుంది. నాడీ కణాలు సమాచారాన్ని విద్యుత్ ప్రచోదనాల రూపంలో (ఎలక్ట్రిక్ ఇంపల్స్) ఒక చోటునుండి వేరోక చోటుకి పంపిస్తాయి.



**వివేక్ :** నాడీ ప్రచోదనం (ఎలక్ట్రిక్ ఇంపల్స్) అంటే ఏమిటి ?

**ప్రొఫెసర్ :** ఏదైనా ఒక చర్యకు నాడీకణం ఉద్దీపనకు గురైనపుడు వాటిలో రసాయన చర్యలు జరిగి ఉత్పన్నమైన శక్తి విద్యుత్ శక్తిగా మారుతుంది. దీనినే నాడీ ప్రచోదనం అంటారు. నాడీ కణం ఉద్దీపనకు గురైనపుడు 55 మిల్లీఓల్ట్‌లు విద్యుత్ పుడుతుంది దీనినే నెర్వ్ ఇంపల్స్ అంటారు (ఎలక్ట్రికల్ ఇంపల్స్). ఈ క్రియాత్మక కరెంట్ ఒక కణంనుండి మరొక కణంలోనికి ప్రవేశించడం ద్వారా సమాచారం ఒక కణం నుండి మరొక కణంలోనికి చేరుతుంది. వివేక్ మానవ శరీరంలో 3 రకాల నాడులు ఉంటాయి.




మానవ మెదడులో ఆలోచనలు కలిగినపుడు న్యూరాన్‌లు ఉత్తేజితమై విద్యుత్ ప్రచోదనాలుఏర్పడతాయి. మెదడు యొక్క మస్తిష్క వల్కలంలో జ్ఞాన కేంద్రాలు ఉండి వివిధ అవయవాలనుండి సమాచారాన్ని గ్రహించి విశ్లేషిస్తాయి. ఉదా: దృష్టి కేంద్రం, శ్రవణ కేంద్రం

మొదలగునవి.

ఈ కేంద్రాలకు నానోసెన్సార్లు అమర్చి నేరుగా బ్రెయిన్‌కి తమ మాటలను, చూపించదలచిన దృశ్యాలను శబ్ద, దృశ్య తరంగ రూపంలో పంపించి మాటలను వినిపించవచ్చు. దృశ్యాలను బ్రెయిన్‌లో ఇమేజ్ అయ్యేలా చేయ్యవచ్చు ఈ రకంగా బ్రెయిన్‌కి శబ్దదృశ్యాల సమాచారాన్ని తరంగ (వేవ్స్) రూపంలో పంపండం వలన ఆ శబ్దదృశ్యాలు బ్రెయిన్‌ని నేరుగా చేరడం వలన మనిషి తన చెవులతో విని, కళ్ళతో చూసిన అనుభూతిని పొందుతాడు.

ఇక మెదడు, సమాచారాన్ని, మెదడుకు అమర్చిన నానో సెన్సార్లు ద్వారా గ్రహించడం వలన జరుగుతుంది. అలాగే మెదడుకు అమర్చిన సెన్సార్లు మెదడు లోపలి న్యూరాన్‌లలో జరిగే మార్పులను గ్రహించి సిగ్నల్స్ రూపంలో దగ్గరలోని ఈ కమ్యూనికేషన్ చేసేవారి కంప్యూటర్‌కి సమాచారాన్ని అందిస్తాయి. కంప్యూటర్ ఈ సిగ్నల్స్ రూపంలోని సమాచారాన్ని ఎనాలసిస్ (విశ్లేషించి) చేసి తిరిగి శబ్ద, దృశ్య రూపంలో అనగా మాటలు, బొమ్మలు (ఆడియో, వీడియో) రూపంలో చూపిస్తుంది. దీనికి ప్రత్యేకమైన సాఫ్ట్‌వేర్ ఉపయోగించబడుతుంది.

**వివేక్ :** ప్రొఫెసర్ బ్రెయిన్‌తో కమ్యూనికేషన్ చేయడం ద్వారా మాటలను శబ్దాలను పంపించడం సాధ్యమని తెలుస్తుంది. మరి ఆలోచనలు ఎలా తెలుస్తాయి?

**ప్రొఫెసర్ :** మానవ మెదడులో ఆలోచనలు కలిగినపుడు న్యూరాన్‌లు ఉత్తేజితమై విద్యుత్ ప్రచోదనాలు ఏర్పడతాయి మెదడు జ్ఞాన కేంద్రాలలో నానో సెన్సార్లు అమర్చినపుడు అవి మెదడు కణాలలో జరిగే మార్పులను విద్యుత్ ప్రచోదనాల రూపంలో గ్రహించి ఆ సంకేతాలను తరంగ రూపంలో దగ్గరలోని రిసీవర్ అనగా కంప్యూటర్‌కి అందిస్తాయి. కంప్యూటర్ ఆ సంకేతాలను ప్రత్యేక సాఫ్ట్‌వేర్ సహాయంతో ఎనాలసిస్ చేసి వాటిని శబ్ద, దృశ్య రూపంలో చూపిస్తుంది.

ఉదా: నీ బ్రెయిన్‌లో రెండు పేర్లను గూర్చి ఆలోచనలు కల్గినపుడు ఇలా జరుగుతుంది.

బ్రెయిన్‌లో **రామా** అనే ఆలోచన కలిగినపుడు విద్యుత్ ప్రచోదనాల రూపం = 1 0 1

బ్రెయిన్‌లో **కృష్ణా** అనే ఆలోచన కలిగినపుడు విద్యుత్ ప్రచోదనాల రూపం = 0 0 1

అనుకుంటే

ఈ విద్యుత్ ప్రచోదనాలను నానో సెన్సార్లు గ్రహించి సిగ్నల్స్ రూపంలో దగ్గరలోని సిస్టంకు చేరవేస్తుంది. హార్ట్‌బీట్‌ను ఏరకంగా ఈ.సి.జి ద్వారా చూపించవచ్చో ఆ రకంగా కంప్యూటర్‌లో ప్రత్యేకించి తయారుచేయబడిన సాఫ్ట్‌వేర్ ద్వారా ఈ సిగ్నల్స్ మాటలుగా వినిపించవచ్చు, దృశ్యాలుగా మార్చి చూపించవచ్చు.

**వివేక్ :** ప్రొఫెసర్ బ్రెయిన్ కమ్యూనికేషన్ చెయ్యటానికి మెదడుకి ఈ నానోసెన్సార్లు ఎలా అమర్చుతారు?

**ప్రొఫెసర్ :** ఈ సెన్సార్లు వెంట్రుక మందం కంటే తక్కువగా ఉంటాయి ఇవి శరీరంలోని కొన్ని భాగాలనుంచి ఉదాహరణకి నడుము దగ్గర మూత్రపిండాలు ఉండే భాగం, లేదా తొడ లేదా మణికట్టు వంటి భాగాలనుంచి వైద్యులు ఎలాంటి మేజర్ సర్జరీ లేకుండా చిన్న రంధ్రం చేసి

మెదడుకి చేరే రక్తనాళాల ద్వారా అమర్చుతారు. ఇది ఎలాగ అంటే గుండె లోపల బ్లాక్స్ ఏర్పడినప్పుడు గుండెకు స్టంట్ ఏరకంగా అమర్చుతారో అదేవిధంగా ఇవి అమర్చుతారు.



**వివేక్ :** ఈ సెన్సార్లు ఎలా పనిచేస్తాయి. ?

**ప్రొఫెసర్ :** మెదడులోపల జరిగే చర్యల వల్ల ఏర్పడే విద్యుత్ ద్వారా ఇవి క్రియావంతం అయ్యి పనిచేస్తాయి.

**వివేక్ :** ప్రొఫెసర్ మానవ శరీరంలో విద్యుత్ ఏర్పడుతుందా, ప్రవహిస్తుందా ?

**ప్రొఫెసర్ :** వివేక్ మానవశరీరంలో స్వల్పమొత్తంలో విద్యుత్ ప్రవహిస్తుంది. అది ఎలా అంటే మానవశరీరంలో అయానుల కదలికల వలన అతి స్వల్పమొత్తంలో కరెంటు ఉత్పత్తి అవుతుంది. దీనిని అయానిక కరెంట్ అంటారు ఇలా ఏర్పడిన విద్యుద్దావేశకణాల ప్రవాహాన్ని విద్యుత్ ప్రవాహం అంటారు. ఈ విద్యుద్దావేశ కణాలు ఎక్కువ శక్తిస్తాయినుండి తక్కువ శక్తిస్థాయికి ప్రవహిస్తాయి. ఎలక్ట్రిక్ కరెంట్ ఉన్నచోట మేగ్నెటిక్ ఫీల్డ్ (అయస్కాంతక్షేత్రము) అనేది ఉత్పత్తి అవుతుంది. అనగా శరీరములో ఉత్పత్తి అయ్యే విద్యుత్ ప్రచోదనాలు శరీరం చుట్టూ తాత్కాలిక అయస్కాంతత్వాన్ని కల్గిస్తాయి.

మన శరీరంలో రెండు ప్రధాన అంగాలైన గుండె మెదడు అయస్కాంతత్వాన్ని ఉత్పత్తి చేస్తాయి. మానవ శరీరంలోని అయస్కాంతత్వము విద్యుదయస్కాంతత్వం (ఎలక్ట్రోమేగ్నటిజమ్) ఇది మానవ శరీరములోపల అయానిక కరెంట్ ప్రవాహముద్వారా ఉత్పత్తి అవుతుంది.

మానవ శరీరం ప్రదర్శించే అయస్కాంత ధర్మం ఆధారంగా ఎం.ఆర్.ఐ. (మేగ్నెటిక్ రిజోనెన్స్ ఇమేజింగ్) అనేది పనిచేస్తుంది. ఇది మానవశరీరంలోపలి భాగాలను తెలుసుకొనేందుకు డాక్టర్లు వాడతారు.

**వివేక్ :** అంటే మానవ శరీరం ఎలక్ట్రోమేగ్నటిజమ్ ప్రదర్శిస్తుంది అన్నమాట.
**ప్రొఫెసర్ :** అన్నమాట కాదు ఉన్నమాట
**వివేక్ :** మానవ బ్రెయిన్‌తో ఏరకంగా కమ్యూనికేషన్ వ్యవస్థ ఏర్పాటు చేయబడుతుంది. ?
**ప్రొఫెసర్ :** బ్రెయిన్‌తో కమ్యూనికేషన్ ఎలాజరుగుతుంది అనేది తెలుసుకోవాలి అంటే ముందుగా కమ్యూనికేషన్ వ్యవస్థలలో రకాలుగూర్చి ప్రాధమిక అవగాహన కలిగి ఉండాలి. అది ఇప్పుడు వివరిస్తాను. అంతకంటే ముందు మెదడు (బ్రెయిన్) ఆలోచనలను ఏ రూపంలో కమ్యూనికేషన్ ద్వారా గ్రహించవచ్చు అనేది చెబుతాను విను. ఇది తెలుసుకోవాలి అంటే ముందు కమ్యూనికేషన్ వ్యవస్థల గూర్చి నీకు అవగాహన అవసరము.

ఇక కమ్యూనికేషన్ వ్యవస్థలలోని ప్రాధమిక అంశాలను వివరించి మీకు అవగాహన కల్గిస్తాను.

వివేక్ కమ్యూనికేషన్ జరగాలి అంటే ఒక ఉత్పత్తిదారుడు (ట్రాన్స్‌మీటర్) మీడియేటర్ (శాటిలైట్), గ్రాహకం లేదా గ్రహీత (రిసీవర్) అనేవి ఉండాలి.

ట్రాన్స్‌మీటర్, : ఏదైనా సమాచారాన్ని ధ్వని తరంగ రూపంలో మనం పంపిస్తాము
**వివేక్ :** అసలు ధ్వని తరంగం ఎలా ఏర్పడుతుంది ప్రొఫెసర్

| FREQUENCY | DESCRIPTION |
|---|---|
| 30 GHz - 300 GHz | Extremely high frequency (EHF) |
| 3 GHz - 30 GHz | Super high frequency (SHF) |
| 300 MHz - 3 GHz | Ultrahigh frequency (UHF) |
| 30 MHz - 300 MHz | Very high frequency (VHF) |
| 3 MHz - 30 MHz | High frequency (HF) |
| 300 kHz - 3 MHz | Medium frequency (MF) |
| 30 kHz - 300 kHz | Low frequency (LF) |
| 3 kHz - 30 kHz | Very low frequency (VLF) |
| 300 Hz - 3 kHz | Voice frequency |
| up to 300 Hz | Extremely low frequency (ELF) |

**ప్రొఫెసర్ :** కంపిస్తున్న వస్తువు ధ్వనిని తరంగ రూపంలో ఏర్పరుస్తుంది. ఒక సెకను కాలంలో చేయు కంపనాల సంఖ్యను ఫ్రీక్వెన్సీ అంటారు. దీనికి ప్రమాణాలు హెర్ట్జ్ (Hz) మనం 20 (Hz) - 20,000 Hzల మధ్య ధ్వనులను వినగలుగుతాము.

**ఇన్‌ఫ్రాసోనిక్స్ :** 20 Hzల కంటే తక్కువ ఫ్రీక్వెన్సి గల ధ్వనులను ఇన్‌ఫ్రాసోనిక్స్ అంటారు

**అల్ట్రాసోనిక్స్ :** 20,000 Hzల కంటే ఎక్కువ ఫ్రీక్వెన్సీగల ధ్వనితరంగాలను అల్ట్రాసోనిక్స్ అంటారు.

| FREQUENCY | DESCRIPTION |
|---|---|
| 30 GHz - 300 GHz | Extremely high frequency (EHF) |
| 3 GHz - 30 GHz | Super high frequency (SHF) |
| 300 MHz - 3 GHz | Ultrahigh frequency (UHF) |
| 30 MHz - 300 MHz | Very high frequency (VHF) |
| 3 MHz - 30 MHz | High frequency (HF) |
| 300 kHz - 3 MHz | Medium frequency (MF) |
| 30 kHz - 300 kHz | Low frequency (LF) |
| 3 kHz - 30 kHz | Very low frequency (VLF) |
| 300 Hz - 3 kHz | Voice frequency |
| up to 300 Hz | Extremely low frequency (ELF) |

ఈ అల్ట్రాసోనిక్ తరంగాలు వైద్య రంగంలో కూడా వాడతారు, వైద్య రంగంలో గుండె, మెదడు వంటి అవయవాల అంతర్నిర్మాణం లోపాలను గ్రహించేందుకు ఈ అల్ట్రా సోనిక్ తరంగాలను పంపి గుండె వంటి అవయవాల అంతర్నిర్మాణాన్ని ఇమేజ్ (చిత్రం) రూపంలో తెలుసుకోగలుగుతారు. ఈ టెక్నిక్‌ని ఎకోకార్డియోగ్రఫి అంటారు.

అల్ట్రాసోనిక్ స్కానర్ అనేది, అల్ట్రాసోనిక్ తరంగాలను పంపి మానవుని శరీర అంతర్భాగాలను ఇమేజ్ (దృశ్య) రూపంలో చూపిస్తుంది. వైద్యరంగంలో డాక్టర్లు ఈ అల్ట్రాసోనిక్ తరంగాలను ఉపయోగించి శరీర అంతర్భాగాల ఇమేజ్‌ని పొందుతారు. వాటి గురించి తెలుసుకోగలుగుతారు. ఈ పద్ధతిలో అల్ట్రాసోనిక్ తరంగాలు శరీరకణజాలల గుండా ప్రయాణించి అంతర్భానికి చేరి తిరిగి పరావర్తనం (రిఫ్లెక్ట్) అవుతాయి. ఈ పరావర్తనం చెందే అల్ట్రాసోనిక్ తరంగాలు ఎలక్ట్రిక్ సిగ్నల్స్‌గా మార్చబడి ఆ అవయవం యొక్క ఇమేజ్ (చిత్రాన్ని) ఏర్పరుస్తాయి. ఈ ఇమేజ్‌లు (చిత్రాలు) ఒక మోనిటర్ మీద చూపించబడుతుంది. ఈ టెక్నిక్‌ని అల్ట్రాసోనోగ్రఫి అంటారు.

| Band | Frequency range | Wavelength range |
|---|---|---|
| Extremely low frequency (ELF) | < 3 kHz | >100 km |
| Very low frequency (VLF) | 3 - 30 Hz | 10 - 100 krn |
| Low frequency(LF) | 30 - 300 kHz | 1 - 10 km |
| Medium frequency (MF) | 300 kHz - 3 MHz | 100m - 1km |
| High frequency (HF) | 3 - 30 MHz | 10 - 100m |
| Very high frequency (VHF) | 30 - 300 MHz | 1 - 10m |
| Ultra high frequency (UHF) | 300 MHz - 3 GHz | 10cm - 1m |
| Super high frequency (SHF) | 3 - 30 GHz | 1 - 10cm |
| Extremely high frequency (EHF) | 30 - 300 GHz | 1mm - 1cm |

తరంగాలు 2 రకాలు 1.శబ్దతరంగాలు, 2. కాంతి తరంగాలు

**శబ్దతరంగాలు :**

**1. రేడియో తరంగాలు** అనేవి విద్యుదయస్కాంత తరంగాలు, వీటిని సుదూరాలకు సమాచారాన్ని పంపడానికి ఉపయోగిస్తారు.

**2. మైక్రోతరంగాలు :** ఇవి కూడా విద్యుదయస్కాంత తరంగాలు, రాడార్, టెలిమెట్రి, మైక్రోఓవేన్‌లలో ఉపయోగిస్తారు, వీటిని ఉపగ్రహాలలో, సమాచార ప్రసరణలలో ఉపయోగిస్తారు.

కాంతి తరంగాలు:

**1. పరారుణ కిరణాలు :** ఇవి కంటికి కనిపించవు, థర్మోఫైల్‌తో వీటి ఉనికిని గుర్తించవచ్చు వీటిని ఉపయోగించి చీకటిలో ఫోటోలు తీయవచ్చు

**2. అతినీలలోహిత కిరణాలు :** వర్ణపటములో ఊదా రంగుకు ఎడమవైపు ఉండే కంటికి కనిపించని వికిరణాలను అతినీలలోహిత కిరణాలు అంటారు.

**3. ఎక్స్ కిరణాలు :** ఇవి 2 రకాలు

1. మృదు ఎక్స్ కిరణాలు: వీటిని వైద్య రంగంలో వాడతారు.
2. కఠిన ఎక్స్ కిరణాలు: వీటిని పరిశ్రమలలో వాడతారు.

**4. గామా కిరణాలు :** ఇవి అత్యల్ప తరంగాలున్న విద్యుదయస్కాంత వికిరణాలు ఈ కిరణాలు అత్యధికంగా చొచ్చుకొని పోగల్గుతాయి. శబ్దతరంగాలు, కాంతి తరంగాల రూపంలోని సమాచారం తరంగ రూపంలో విద్యుత్ సంకేతాలుగా మార్చబడి ఒక చోటి నుండి మరియొక చోటికి పంపబడతాయి. రేడియో, సెల్ఫోన్, టీ.వి. కంప్యూటర్‌లలో సమాచారం ఒక చోటు నుండి మరియొక చోటుకి ఇలా పంపబడుతుంది.




**వివేక్ :** సమాచార ప్రసారం (కమ్యూనికేషన్) అనేది ఒకే రకంగా జరుగుతుందా ప్రొఫెసర్ ?

**ప్రొఫెసర్ :** కమ్యూనికేషన్ అనేక రకాలుగా జరుగుతుంది వివేక్

**1. మైక్రోవేవ్ కమ్యూనికేషన్ :** ఈ కమ్యూనికేషన్‌లో మైక్రోవేవ్స్‌ని ఉపయోగించడం జరుగుతుంది ఇవి ఎక్కువ ఫ్రీక్వేన్సీతో ప్రయాణిస్తాయి, ఈ కమ్యూనికేషన్ ద్వారా ఎక్కువ దూరాలకు డేటాని పంపవచ్చు.

**2. శాటిలైట్ కమ్యూనికేషన్:** ఈ కమ్యూనికేషన్‌లో మైక్రోవేవ్స్ ద్వారా శాటిలైట్‌కి సమాచారాన్ని పంపించి తిరిగి ప్రత్యేక ఫ్రీక్వెన్సీలో సమాచారాన్ని గ్రహించడం జరుగుతుంది. శాటిలైట్ కమ్యూనికేషన్‌లో 1GHz నుంచి 10 GHz ఫ్రీక్వెన్సీలో మైక్రోతరంగాలను పంపడం జరుగుతుంది.

ఉదా: వెదర్‌ఫోర్‌కాస్టింగ్, గ్లోబల్ పొజిషనింగ్, టెలివిజన్ సిగ్నల్స్‌లో వాడతారు.

**3. రేడియో వేవ్ ట్రాన్స్ మిషన్ :** రేడియో తరంగాలు చాలా దూరం చొచ్చుకొని పోగల్గుతాయి. దూర ప్రాంతాలకు కమ్యూనికేషన్ కోసం వీటిని వాడతారు. వీటి ఫ్రీక్వెన్సీ 30 KHz – 10 GHz వరకు ఉంటుంది.

ఉదా: కార్డ్‌లెస్ ఫోన్, ఎఫ్.ఎమ్. రేడియో.

**4. ఇన్‌ఫ్రారెడ్ :** ఇన్‌ఫ్రారెడ్ వేవ్స్ అనేవి హై ఫ్రీక్వెన్సీ వేవ్స్, షార్ట్ రేంజ్ కమ్యూనికేషన్‌లో వాడతారు.

ఉదా: టి.వి. వి.సి.డి, రిమోట్ కంట్రోల్స్ మొదలైనవి.

**5. బ్లూటూత్ :** ఇది రేడియో సిగ్నల్స్ ఆధారంగా పనిచేస్తుంది. అన్ని వైపులకు సిగ్నల్స్‌ని ఒకే చోటు నుంచి పంపుతుంది. దీని పరిధి సుమారు 10 మీటర్లు

**6. వైఫై :** వై ఫై జోన్ సుమారు 50 మీటర్ల వరకూ ఉంటుంది.




**ప్రొఫెసర్ :** రఘు, వివేక్ అర్థం అయిందా ఈ కమ్యూనికేషన్ వ్యవస్థల గురించి.

**రఘు :** ఎస్ ప్రొఫెసర్

ప్రొఫెసర్ రఘుని ఒక రూమ్‌లోనికి తీసుకువెళ్ళి అక్కడి బల్లమీద పడుకోమని తన దగ్గర ఉన్న అధునాతన స్కానర్‌తో పరీక్షిస్తాడు. రఘు బాడీని దానితో పరీక్షించగా అతని తలలో ఏవో సెన్సార్లు ఉన్నట్లు వాటినుంచి ఎలక్ట్రానిక్ సిగినల్స్ వస్తున్నాయని గుర్తిస్తాడు.

**వివేక్ :** ఇది ఏంటి ప్రొఫెసర్

**ప్రొఫెసర్ :** ఇది ఒక ఎం.ఆర్.ఐ స్కానర్ వంటిది. దీనిని శరీరాన్ని స్కాన్ చెయ్యడానికి ఉపయోగిస్తారు. అంటే తల భాగం ఎలా ఉన్నది. ఎక్కడైనా రక్తం గడ్డకట్టిందా కణుతులు లాంటివి ఉన్నాయా, మెదడు పరిస్థితి ఏంటి, శరీరం లోపల ఏవైనా ఫారిన్ బాడీస్ ఉన్నాయా

లాంటివి తెలుసుకోవచ్చు. ఎలక్ట్రానిక్ సిగ్నల్స్‌ని ఇది గుర్తుపడుతుంది. జస్ట్ లైక్ ఇది మెటల్ డిటెక్టర్ లాంటిది.

ప్రొఫెసర్ రఘు శరీరభాగాను స్కాన్ చేసి ఫలితాలను చూసి ఇలా అంటాడు.

**ప్రొఫెసర్ :** వివేక్ నీ తమ్ముడు రఘు శరీరభాగాలలో అక్కడక్కడా ఎలక్ట్రానిక్ సిగినల్స్‌ని గ్రహించే నానో సెన్సార్లు ఉన్నాయి. ఇవి ఎవరో చాలా తెలివిగా అమర్చారు.

**వివేక్ :** నానో సెన్సార్లు అంటే ?

**ప్రొఫెసర్ :** మనిషి తల వెంట్రుకలో 1000 వంతు కంటే తక్కువ మందం గల సెన్సార్లు, ఈ నానో సెన్సార్లు వీటి తయారికి సంబందించిన పరిజ్ఞానం మన ఇండియాలో చాలా తక్కువ వీటి గురించి వైద్యరంగం, కమ్యూనికేషన్ రంగాలలో పనిచేసే ఇంజనీర్లు, డాక్టర్లు కూడా పూర్తి అవగాహన కలిగి ఉండరు. ఇవి చాలా అధునాతమైనవి ఇలాంటి సెన్సార్లు యు.ఎస్. మరియు యు.కె. లాంటి దేశాలలో రక్షణ, గూడచారి సంస్థలలో, వైద్యపరిశోధన సంస్థలలో ఎక్కువగా వాడతారు.

**వివేక్ :** అవును ప్రొఫెసర్ ఆ మద్య తమిళ డబ్బింగ్ సినిమా హీరో విజయ్‌ది చూసాను. అందులో తీవ్రవాదులు ఆర్మీ ఆఫీసర్ హీరో అయిన విజయ్‌ని ఒంటరిగా తమ స్థావరానికి రావాలని కండీషన్ పెడితే ఆయన తన మాజీ ఆర్మీ ఆఫీసర్ల సహాయంతో శరీరంలోనికి ఒక బయో సెన్సార్‌ని అమర్చుకొని వెళతాడు. దాని కారణంగా అతడు ఏ దిశలో ఎంత దూరంలో ఉన్నాడు అనే విషయం తెలుస్తుంది. ఇలాంటివి మిలటరీ ఆపరేషన్‌లలో మాత్రమే అరుదుగా ఉపయోగిస్తుంటారు. అదికూడా అమెరికా లాంటి విదేశాలలో.

**ప్రొఫెసర్ :** ఈ నానో సెన్సార్లు, బయో సెన్సార్లు గూర్చి మీలాంటి తెల్సినవాళ్ళు కొట్టి పారెయ్యలేరు. ఇలాంటివి వాస్తవంగా ఉంటాయని సాదారణప్రజలు నమ్మరు. ఎందుకంటే మన ప్రజలలో నిన్నమొన్నటివరకూ 70% నిరక్ష్యరాశ్యులు గత 20 సంవత్సరాలుగా అక్షరాశ్యత పెరిగి అది ఈ మద్య సుమారు 75%నికి చేరింది.

ఈ 75% అక్షరాస్యులలో ప్రొఫెషనల్ కోర్సులు అనగా ఇంజనీరింగ్, మెడిసన్‌లాంటివి చదివిన వారు 30% నికి మించి ఉండరు. మళ్ళీ పరిశోధనా రంగంలో రీసెర్చ్ రంగంలో ఉండేవారు సుమారు 0.5% అనగా నూటికి ఒకరు కూడా మన ఇండియాలో లేరు.

నువ్వు విద్యావంతులు అనుకునే వీళ్ళ దగ్గరకు వెళ్ళి బయో సెన్సార్లు నానో టెక్నాలజీ, ఆప్టికల్ ఫైబర్స్, వైర్‌లెస్ కమ్యూనికేషన్, రిమోట్ సెన్సింగ్ & రోబోటిక్స్ వీటి టెక్నాలజీ గురించి చెప్పేవనుకో నువ్వు ఏదో తమిళ సినిమా చూపిస్తే ఎంత బోర్‌గా ఫీలవుతారో నువ్వు చెప్పే అశాలను గూర్చి కూడా విని అలానే ఫీలవుతారు. కారణం నువ్వు చెప్పే అంశాలను గూర్చి వీళ్ళకు అవగాహన లేకపోవడం. ఈ నానో టెక్నాలజీ, బయోసెన్సార్ వంటి పదాలను 90% ప్రజలు తమ నిత్యజీవితంలో ఒక్కసారి కూడా వినిఉండరు.

**వివేక్ :** అవును సార్ కొత్త టెక్నాలజీ గురించి మనకు తెలియదు

**ప్రొఫెసర్ :** వివేక్ నేను ఆ మధ్య చెన్నై వెళ్ళినపుడు ఒక అత్యాధునిక ఎలక్ట్రానిక్ గూడ్స్ అమ్మే ఒక షోరూమ్‌లోకి వెళ్ళాను ఆ షోరూమ్‌లోని టి.వీలో రఘువరన్ బి.టెక్ అనే సినిమా వస్తుంది. అందులో ఒక సన్నివేశంలో హీరో విలన్ క్యాబిన్‌లోకి వెళతాడు. హీరో అక్కడి సి.సి. కేమెరా, సె ల్‌ఫోన్‌లను, సెల్‌ఫోన్ జామర్‌ను ఉపయోగించి పనిచేయకుండా ఆపేస్తాడు. అది చూసి నేను సరదాకి అక్కడ ఉన్న సేల్స్‌బోయ్‌ని పిలిచి అలాంటి జామర్స్ మీ దగ్గర దొరుకుతాయా అని అడిగాను ఆ సేల్స్ బోయ్, అది సినిమా సార్, నిజంగా అలాంటివి ఉండవు అన్నాడు. ఆ సేల్స్ బోయ్ మాటలకు నాకు నవ్వు వచ్చింది. ఎందుకంటే లేటెస్ట్ సెల్‌ఫోన్‌లు, సి.సి.కెమేరాలు కంప్యూటర్లు వంటి అత్యాధునిక ఎలక్ట్రానిక్ వస్తువులను అమ్మే షోరూమ్‌లోని సేల్స్ బోయ్‌కి కూడా సెల్‌ఫోన్ జామర్స్ అనేవి ఉంటాయని తెలియకపోవడం. వాటి గురించి అవగాహన లేకపోవడం.

అమెరికా లాంటి దేశాలలో 20 ఏళ్ళ క్రితం వాడిన టెక్నాలజీని మనం ఈ రోజు వాడుతున్నాము. అంటే టెక్నాలజీ విషయంలో మనం కొన్ని అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చుకుంటే సుమారు 30సం॥రాలు వెనుకబడిపోయి ఉన్నాము. అంటే 2,3 జనరేషన్‌లు వెనుకబడిపోయి ఉన్నాము. విదేశాలలోని నూతన ఆవిష్కరణలుకొత్త ఎలక్ట్రానిక్ వస్తువులు వాటి ఉపయోగాలు మనకు కొత్తగా వింతగా నమ్మలేని విధంగా ఆశ్చర్యకరంగా ఉంటాయి

**వివేక్ :** నిజమే సార్ మనకు తెలియని కొత్త విషయాన్ని అంతసులభంగా మనం నమ్మలేము.

**ప్రొఫెసర్ :** వివేక్ నీ తమ్ముడు శరీరంలో అక్కడక్కడా నానో సెన్సార్లు ఎవరో అమర్చారు నా ఆలోచన ప్రకారం రఘు చెన్నై ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళినపుడు జి.ఆర్. హాస్పటల్‌లో అవి అమర్చి ఉండవచ్చు.

ఎందుకంటే జి.ఆర్. రిసెర్చ్ సెంటర్ అనేది బహుశా యు.కె, లేదా అమెరికాలో ఉన్నదనుకుంటా. వాళ్ళు అతి రహస్యంగా బ్లూ బ్రెయిన్ ప్రోజెక్ట్ అనే పేరుతో మానవ మెదడు పై రీసెర్చ్ చేస్తున్నారు. వాళ్ళ రీసెర్చ్‌లో నానో సెన్సార్లు వాడతారు. వారికి చెన్నైలోని జి.ఆర్. హస్పటల్‌కి ఏవైనా సంబందాలు ఉండి ఉండవచ్చు. వాళ్ళు తమ ప్రయోగానికి అతి రహస్యంగా మీ తమ్ముడిని ఎంచుకొని ఉండవచ్చు. వాళ్ళు అమర్చిన సెన్సార్లు మీ తమ్ముడి సమస్యలకు కారణం అవుతున్నాయి.

**వివేక్ :** ఇప్పుడెలా మా తమ్ముడి తలకు ఆపరేషన్ చేసి ఆ సెన్సార్లు తీసివేయాలా?

**ప్రొఫెసర్ :** అవసరం లేదు వివేక్, ఈ సమస్యకి రెండు పరిష్కార మార్గాలున్నాయి. మొదటిది ఆ సెన్సార్లు పనిచేయకుండా చేయడం. రెండవది ఆ సెన్సార్లు రఘు శరీరంలో అమర్చిన వాళ్ళను, వాటిని ఉపయోగించే వాళ్ళను వెతికి పట్టుకోవడం. నేను ఆ సెన్సార్లును పనిచేయకుండా చేసే మార్గం చెబుతాను.

**వివేక్ :** ఏమిటామార్గం ?

**ప్రొఫెసర్ :** రఘుకి తలపోటు, మగత, కళ్ళు తిరగటం, చేతి వేళ్ళు వంకరపోవడం వంటివి

రీసెర్చ్ టీం ఒక ప్రత్యేక ఫ్రీక్వెన్సీలో వేవ్స్‌ను పంపడం వలన జరుగుతుంది. రఘు శరీరంలో నానో సెన్సార్లు అమర్చిన డాక్టర్ల టీం పంపే సిగ్నల్స్‌ని మనం ఆపివేయగలిగితే ఆ సెన్సార్లు పనిచేయడం ఆగిపోతుంది.

## RANGE & COVERAGE

| UHF & VHF | Open areas without obstructions | Steel and /or concrete reinforced | High Rise Buildings |
|---|---|---|---|
| UHF 1 watt | Up to 1 miles | Up to 220,000 sq ft. | Up to 15 floors |
| UHF 1.5 watt | Up to 2 miles | Up to 250,000 sq ft | Up to 17 floors |
| UHF 2 watt | Up to 5 miles | Up to 275,000 sq ft | Up to 20 floors |
| UHF 4 watt | Up to 7 miles | Up to 350,000 sq ft | Up to 30 floors |
| VHF 2 watt | Up to 6 miles | Up to 220,000 sq ft | Up to 13 floors |
| VHF 5 watt | Up to 7 miles | Up to 300,000 sq ft | Up to 18 floors |

Talk range will vary based on terrain conditions and type of radio

**వివేక్ :** అది ఎలా ప్రొఫెసర్ ?

**ప్రొఫెసర్ :** ఈ నానో సెన్సార్లు ఒక ప్రత్యేక ఫ్రీక్వెన్సీలో రేడియో తరంగాలను స్వీకరిస్తూ పనిచేస్తుంటాయి. ఈ ఫ్రీక్వెన్సీ ఏ రేంజ్ మద్య పంపించబడుతుందో తెలుసుకొని ఆ రేంజ్ ఫ్రీక్వెన్సీ సిగ్నల్ జామర్‌ను ఉపయోగించగలిగితే ఆ నానో సెన్సార్లు పనిచేయకుండా చేయవచ్చు. రఘు మీద ఫ్రీక్వెన్సీ పెంచి వేవ్స్ (తరంగాలను) పంపినపుడు రఘు మెదడులోని నానో సెన్సార్లు అధికంగా యాక్టివేట్ అయ్యి అధిక రేడియోషన్‌ని వెలువరించి మెదడుపై ప్రభావం చూపి తలపోటు, మగత కల్గిస్తాయి.

ఇంకా హై ఫ్రీక్వెన్సి పెంచితే కళ్ళు తిరిగి పడిపోవడం, వెరీ హై ఫ్రీక్వెన్సీలో సిగ్నల్స్‌ని పంపితే ఎక్కువ రేడియేషన్ ఏర్పడి కోమాలోకి చేరుకోవడం, శరిరభాగాలు చచ్చు పడిపోవడం, బ్రెయిన్ డెడ్ అవ్వటం జరుగుతుంది.

ఈ రీసెర్చ్ చేసిన డాక్టర్ల టీంకి తప్ప సమాన్య జనాలకు డాక్టర్లకు తెలియని విషయము. ఇది ఎవరో తెలివిగా రఘు మీద ప్లాన్ చేసి ప్రయోగించారు.

**వివేక్ :** అది సరే మా తమ్ముడి సమస్యకి పరిష్కారం ఏమిటి ?

**ప్రొఫెసర్ :** వివేక్ ఈ కమ్యూనికేషన్ అతి తక్కువ ఫ్రీక్వెన్సీలో 30 Hz నుండి అతి ఎక్కువలో

5000 Hz ఫ్రీక్వెన్సీల మధ్య జరుగుతూ ఉండవచ్చు.

| TABLE 1: MICROWAVE LETTER BAND DESIGNATIONS | | |
|---|---|---|
| Band | Frequency range | Applications |
| L | 1 to 2 GHz | Satellite, navigation (GPS, etc.), cellular phones |
| S | 2 to 4 GHz | Satellite, SiriusXM radio, unlicensed (Wi-Fi, Bluetooth, etc.), cellular phones |
| C | 4 to 8 GHz | Satellite, microwave relay |
| X | 8 to 12 GHz | Radar |
| $K_u$ | 12 to 18 GHz | Satellite TV, police radar |
| K | 18 to 26.5 GHz | Microwave backhaul |
| $K_a$ | 26.5 to 40 GHz | Microwave backhaul |
| Q | 30 to 50 GHz | Microwave backhaul |
| U | 40 to 60 GHz | Experimental, radar |
| V | 50 to 75 GHz | New WLAN, 802.11ad/WiGig |
| E | 60 to 90 GHz | Microwave backhaul |
| W | 75 to 110 GHz | Automotive radar |
| F | 90 to 140 GHz | Experimental, radar |
| D | 110 to 170 GHz | Experimental, radar |

ఈ ఫ్రీక్వెన్సీని బ్లాక్ చెయ్యగలిగే సిగ్నల్ జామర్ లేదా ఎలక్ట్రానిక్ జామర్లను మనం తయారుచేయించి ఆ జామర్లను ఉపయోగించి మీ తమ్ముడిపైకి వాళ్ళు పంపే సిగ్నల్స్‌ని ఆపి ఈ కమ్యూనికేషన్ బారినుండి మీ తమ్ముడిని కాపాడవచ్చు.

**వివేక్ :** ఇవి ఎక్కడ దొరుకుతాయి

**ప్రొఫెసర్ :** మన ఇండియాలో ఎలక్ట్రానిక్స్‌లో తలపండిన వాళ్ళు ఎందరో ఉన్నారు. మన ఇండియాలో సిగ్నల్ జామర్‌లను, ఎలక్ట్రానిక్ జామర్లను తయారుచేసే సంస్థలు ఎన్నో ఉన్నాయి. నా స్టూడెంట్స్‌లో ఎవరికి చెప్పినా ఇలాంటి సిగ్నల్ జామర్లను తయారు చేసి యిస్తారు. అందాక ఎందుకు మన ఇంజనీరింగ్ కాలేజీలలో ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్‌విద్యార్థులు వాళ్ళ ప్రోజెక్ట్ వర్కులలో బాగంగా సిగ్నల్ జామర్స్ లేదా ఎలక్ట్రానిక్ జమార్స్‌ని తయారు చేస్తుంటారు. వాళ్ల ఎవరి దగ్గరయినా మనకు కావలసిన సిగ్నల్ జామర్లను కావలసిన ఫ్రీక్వెన్సీలో తయారు చేయించుకోవచ్చు దీనికి లక్షల రూపాయిలు ఖర్చు పెట్టనక్కర్లేదు. కొన్ని వేల రూపాయిల ఖర్చుతో వీటిని తయారు చేయవచ్చు. ఈ బ్రెయిన్ రీడింగ్ (బ్రెయిన్ కమ్యూనికేషన్) ఆపవచ్చు.

ఆ మధ్య నేను సింగపూర్ వెళ్ళినపుడు అక్కడ మన ఇండియాకు చెందిన డా॥ఆర్.కె అనే న్యూరో సైక్రియాటిస్టును కలిసాను ఆయనను బ్రెయిన్ మ్యాపింగ్, బ్రెయిన్ రీడింగ్ వంటి బ్రెయిన్ రిసెర్చ్‌ల గురించి అడగగా అటువంటివి ఏమీ ఉండవు అదంతా భ్రమ అబద్ధం

